"శ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద" మను గ్రంథమందు

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వాముల వారు స్వయముగ చెప్పిన

# మానస పూజా విధి

నామ రూప క్రియా రహితంబైన యా మహద్వస్తువై వెలుంగుచున్న దానికి నేజేయు పూజా తంత్రంబులు శాశ్వతంబులై వెలుంగు గాక-

ఓం మహాదేవి నదీనదాబ్ధి మహాజలంబులు నీకు నభిషేకంబులుగా- మృత్శిలా దారు జంతు సలిల సహితంబైన చతుర్దశ భువనంబులు నీకు గంధంబుగా- నక్షత్ర గ్రహరాశి మహా మండలావృత పరాగ కేసరీ యుక్తంబైన మహాకాశము నీకు పుష్పంబుగా- నింద్యా నింద్యంబులులేక సర్వ దిగ్భ్రమణంబగు తుహినకళ భూపరాగ ఆకాశ ధూపంబునుం గల వాయువ నీకు ధూపంబుగా - సర్వాశిని యగు అగ్ని నీకు దీపంబుగా - ఇన్నియును గలిసి నేనైన నేనే నీకు ప్రసాదంబుగా నర్పించితి గైకొనుమా! భక్తరక్షణోత్సాహివై రక్షింపుమా! నమోనమో నమః!!

శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు - ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## శ్రీ సనారీశ్వర స్తుతి (ప్రార్థన)

1. క్షీరాచల ప్రభాసితం
వీరాచార్య తనూభవం
అన్నపూర్ణేశ్వరీ ప్రియం
సనారీశం నమోస్తుతే॥

2. సింహాద్రి భవ్యగృహాఖ్యం
విశ్వనాథ పవిత్రాఖ్యం
అవధూత మునీశ్వరం
సనారీశం నమోస్తుతే॥

3. దివ్యతపః ప్రభాసితం
శాపానుగ్రహ వాగీశం
కాశీవిశ్వేశ్వర తేజం
సనారీశం నమోస్తుతే॥

4. అకాల మృత్యుహరణం
సర్వదారిద్ర్య వారణం
శోకభయార్తి దారణం
సనారీశం నమోస్తుతే॥

5. సర్వప్రపంచ ధారణం
నిత్యకల్యాణ పూరణం
జన్మసాఫల్య కారణం
సనారీశం నమోస్తుతే॥

మడిమైలల పట్టింపులు లేక కులమతభేదము లెంచక స్త్రీపురుషు లెవరైన నీ మానస పూజా విధిని, స్తుతిపంచకమును ప్రతిదినము ఉదయము నిద్రలేచినపుడు రాత్రి శయనించునపుడు పఠించిన వారికి శ్రీ సనారి స్వామి వారి దివ్యానుగ్రహము సిద్ధింపగలదు.

ఓం శ్రీ సాయిరాం

# శ్రీ మాతా అన్నపూర్ణా సమేత

# విశ్వనాథావధూత స్వాములవారి

## జీవిత బొమ్మల కథలు

## కాలజ్ఞాన ప్రమాణము

విశ్వములో విశ్వనాథావధూతయై
విశ్వేశ్వరుం డవతరించేనయా!
విశ్వములో తాను శాశ్వతంబుగ నుండి
విశ్వనాథుండనని పల్కేనయా!
దుష్ఠ సంస్కర్తయై శిష్టపాలనాధ్యక్షుడై
ముక్కన్నుల చూపేనయా!
అష్టాంగ యోగముల్ సృష్టి స్థితియు దెల్పి
దాక్షాయణిని వడి జూపేనయా!

అని క్రీ॥శ॥ 1794వ సం॥నకు సరియైన శ్రీ నందననామ సంవత్సరమున జన్మింపనున్న పరమేశ్వరాంశ సంభూత శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ సింహాద్రి విశ్వనాథావధూత స్వాముల వారిని గుఱించి ముందుగనే త్రికాలవేదియైన జగద్గురు శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారు 1625వ సంవత్సర ప్రాంతమున వారి కాలజ్ఞానమునందు చెప్పి యుండిరి. "వీరబ్రహ్మాం వాక్యం వేదవాక్య" మనెడి నానుడి వినని వారుండరు. గ్రహరాజు గతులు దప్పినను బ్రహ్మంగారు చెప్పిన భవిష్యత్తు భంగపడ" దనుటకీ సనారీ విశ్వేశ్వర స్వాముల వారి సచ్చరిత్ర యొుక ప్రత్యక్ష నిదర్శనము.

## పాలరాలకొండ పాలకొండ

ఆంధ్రప్రదేశంబున శ్రీకాకుళం జిల్లాలో నాగావళి జీవనదికి ఎనిమిది మైళ్ల దూరమున నున్న సుందర నగరం పాలకొండ. ఇచ్చటి కొండరాళ్లు పాలవలె తెల్లనివై యున్నందున పాలరాలకొండ పాలకొండయై యుండవచ్చును. ఈ గ్రామ మందలి గొల్ల వీధి ప్రశస్తమై యున్నందున గతకాల వైభవము నందిచట పాల విక్రయదారు లధికముగ యుండి యుండురనియు ఊహింపదగియున్నది.

పాలకొండ పూర్వ మొకప్పుడు ప్రభువులు పాలించిన రాజనగరం. ఇచట ప్రసిద్ధములైన దేవాలయములు. దేవ్యాలయము లనేకము లున్నవి. మరియు చరిత్ర గలిగిన స్థలము లిందు గలవు. ఇది కాశీ విశ్వనాథుడైన శంకరుడు శ్రీసింహాద్రి విశ్వనాథావధూత నామమున నవతరించిన పుణ్యస్థలం- మనకు

యాత్రాస్థలం. పాలకొండ క్షేత్రపాలక స్వామి శ్రీమాతా అన్నపూర్ణా సమేత విశ్వనాథావధూత స్వాములవారు.

## శ్రీ రామలింగేశ్వరాలయము

పరమేశ్వరావతార మూర్తులు పూజ్యచరణ శ్రీ సింహాద్రి విశ్వనాథావధూత స్వాముల వారిచే ప్రతిష్ఠ చేయబడిన రామలింగేశ్వర దేవాలయం పాలకొండలోని అన్నవరము నందతి వైభవముగ వెలుగొందుచున్నది. అంతకుముందు పోతులగడ్డ యందున్న ఆదిమాంధ్రులోక చిన్నపాక యందుంచి పూజించుచున్న శివలింగమును సనారీ విశ్వేశ్వరులిచట రామలింగేశ్వర స్వామి పేరున ప్రతిష్ఠ చేసిన చరిత్ర సుప్రసిద్ధము.

ఆలయస్థల విస్తీర్ణము రమారమి పదునైదు ఎకరములు. క్షేత్రపాలక రామలింగేశ్వర దేవస్థాన గర్భాలయమున శ్రీ అన్నపూర్ణాదేవి- విఘ్నేశ్వర స్వామియు వేంచేసి యుండిరి. స్వామి కభిముఖముగ సుందరమైన నంది విగ్రహమున్నది. గర్భాలయమునకు ముందు విశాలమగు చక్కని మండపము ధ్వజస్తంభమును కలవు.

ప్రాకారము లోపల సుబ్రహ్మణ్యేశ్వరాలయము. నవగ్రహ మండపము లమరి యున్నవి. యజ్ఞశాల; పూలతోట; నీటి బావులును కలవు. రామలింగేశ్వర లింగ ప్రతిష్ఠ కాలమున నిచటకు నాగుబాములు వచ్చి ప్రజాసమూహమున నిర్భయముగ పడగలు విప్పి పారవశ్యమొదవ నృత్య మొనరించిన యుదంతము కడుంగడు ప్రశంసనీయము. నేటికిని ప్రాకారము లోపల పాములు యథేచ్ఛగ సంచరించుచున్నను ఎవరి కెట్టి ప్రమాదముగాని ప్రాణభయముగాని కలుగ లేదనిన నటరాజు నాగాభరణుడు గద! ఆ కారణముననే కాబోలు ఆలయ ప్రాకారము నందున్న పాము పుట్ట కానాటి నుండి యీనాటి వరకును పూజలు విరివిగ జరుగుచున్నవి.

ఈ ఆలయ నిర్మాణం క్రీ॥శ॥ 1850 వ సం॥ ప్రాంతమున జరిగినట్లు చెప్పచుండిరి. ఇచటి పూజారులు జంగమదేవరలు. ఆలయము ఎండోమెంటు వారి పాలనలో చేరినది. ప్రతిదినము స్వామిని దర్శించి సేవింప వచ్చుచున్న భక్త సమూహములతో క్షేత్రము కళ కళలాడుచున్నది.

## జంగాల చెఱువు

జంగాల చెఱువు గ్రామమునకు తూర్పున వెంకమ్మ పేట యందున్నది. విశ్వనాథాచార్యులీ చెఱువు నందున్నపుడె విరాడ్విశ్వకర్మ భగవానుడు మహా తపస్వి రూపమున గగన సంచారియై వచ్చి పరిపూర్ణానుగ్రహంబున హస్తమస్తక సంయోగ మొనరించి అద్వితీయ దివ్యశక్తులను ప్రసాదించిన చరిత్ర నిరుపమానము.

నాడీ చెఱువు సువిశాలమై. తామరలకు నిలయమై- పవిత్ర జలపూరితమై యుండవచ్చును. నేడు చిన్న జలాశయము వలె కన్పట్టుచున్నది. సరియైన సంస్కారము లేక చాల భాగము పూడికబడి యుండవచ్చును.

## ప్రాత రామలింగేశ్వరాలయము

ఇది జంగాల చెఱువు నంటుకొని గట్టుపై నున్నది. స్వాములవారు చెఱువున స్నాన మొనరించిన పిదప నీ రామలింగేశ్వరు నారాధించుచుండెడి వారు. ఆలయము చాల చిన్నది. పరిసర కట్టడములు శిథిలములై యున్నవి. ఆలయ ప్రాకారాది గోపురము లిచట కన్పించుట లేదు.

ఇవికాక వెంకమ్మపేట యందే జగన్నాథాలయము; ఆంజనేయాలయము; భీమలింగేశ్వరాలయములు- అన్నవరమున వేంకటేశ్వరాలయము- గ్రామకూడలి యందు సీతారామాలయము; కోదండ రామాలయము; సదా శివాలయములు- గొల్లవీధి యందు కంచి కామాక్షీదేవ్యాలయము- జెట్టివారి వీధి యందు సంతోషిమాతా దేవ్యాలయము- సిరిపుర మందు గాయత్రీ మంత్రాలయములేగాక శ్రీషిర్డీ సాయిబాబా దేవాలయములు పాలకొండ యందు ప్రసిద్ధములై యున్నవి.

## గౌరమాంబా వీరాచార్య దంపతులు

**క్రీ॥శ॥ 18వ శతాబ్దం నాటి చరిత్ర:-**

పాలకొండ గ్రామ మందలి తూర్పుభాగమున నున్నది కోమటిపేట. అచట గ్రామ జనాభా యందు మూడవ వంతు బ్రాహ్మణు లుండిరి. వారికి ప్రక్క వీధిలో సింహాద్రి వారు. టేకివారు, పండూరివారు, కడియంవారు, మారోజు వారు, లక్కోజువారు, కొమ్మోజువారు, బొండాడవారు, దేవువారు, మహేశ్వరంవారు, గొన్నాభక్తులవారు, తూగుబాటివారు, బంగారువారు మొదలైన గృహనామములు గల విశ్వబ్రాహ్మణులుండిరి.

శిల్పాచార్యులందు సింహాద్రి గౌరమాంబా వీరాచార్య దంపతు లాదర్శనీయులు. వీరయోగీంద్రులు స్వర్ణశిల్పమున కుందనపు పని చేయుచునే ఆయుర్వేదవైద్యమును చేయుచుండెడివారు. పాషాణ భస్మములను చేసి వానిని వైద్య ప్రక్రియలందుపయోగించుట యందును సిద్ధహస్తులు. వారి ధర్మపత్ని గౌరమాంబ ఉత్తమురాలు. పతికి దగిన సతీమణి. అతిథి అభ్యాగతుల కాదంపతు లాత్మబంధువులు- స్నాన సంధ్యానుష్ఠాన నియమంబుల కాగృహము జన్మభూమి- సత్యాహింస దాన ధర్మముల కామహనీయు లాశ్రమదాతలు.

ఎన్ని యున్ననేమి? ఎత్తికొని ముద్దాడ- నట్టింట నడియాడ- ముద్దు ముద్దు మాటల ముచ్చటలు చెప్ప కడుపున బుట్టిన కొడుకులు లేరు. సంతానలోపము సంతాపహేతు వైనందున వారొక శుభదినమున తీర్థయాత్రలు సేయ

సంకల్పించి ప్రప్రథమంబున తిరుపతికి పోయి ఆకాశగంగ యందు స్నాతలై లక్ష్మీపద్మావతీ సమేత శ్రీనివాస వేంకటేశ్వరుని దర్శించిరి. పద్మనాభం, శ్రీకూర్మం, అరసవల్లి, జగన్నాథము లందు పర్యటించుచు కాశీక్షేత్రమున కేగిరి. గంగా స్నానానంతరమున అన్నపూర్ణా సమేత విశ్వనాథుని దర్శించి కరములు ముకుళించి నిమీలితనేత్రులై "విశ్వనాథా! ఆశ్రితవత్సలుడవు; అనంత దయాసముద్రుడవు; భక్త వరదుడవు; భవభయహరుడవు. దీనులమై దేహీ యని పాదము లంటి ప్రార్థించుచున్న మా గర్భమున నీవైన పుట్టరాదా తండ్రీ!" అని పరిపరి విధముల వేడుకొనిరి.

ఆ సమయంబున వారి యొడలు పులకరించినవి. నేత్రములశ్రు పూరితములైనవి. ఏదో తెలియని ఆనందానుభూతి వారి నావరించి మైమరపించినది. నాటి రేయి వారచటనే శయనించిరి. "ఓం నమశ్శివాయ" అను శివ పంచాక్షరీ మహామంత్రమును జపించుచు నిదురించిరి.

ఆ పుణ్యదంపతు లిరువుర కొకే పర్యాయము స్వప్న సాక్షాత్కారము నిచ్చిన శంకరుడు "భక్తులారా! మీరు చింతింప వలదు. లోక కల్యాణార్థము నేనే మీకు పుత్రుడనై జన్మించెద- అపుడు మీ కుమారునకు నా పేరే నామకరణం చేయుడు. కాలాంతరమున నేనే కాశీవిశ్వనాథుడనని ప్రజలకు తెలియ జెప్పెద- పార్వతీ పతిత్వము, ఫాలనేత్రముల చూపి పరమ శివావతారమూర్తినని సాదృశ్యముల నిచ్చెద- అనంతరమున మృత్యుంజయుండనై శ్రీశైలంబు నందఖండ తపోదీక్ష వహించి మనోవాక్కాయకర్మల నన్ను నమ్మి పూజించుచు సదా నా నామస్మరణ చేసిన వారిని వెన్నంటియుండి కాపాడెద"నని చెప్పి అదృశ్యమయ్యెను.

నిద్రమేల్కాంచిన ఆచార్యదంపతులు అపరిమితానంద భరితులై లేచి స్వామి కరుణా విశేషమును మిక్కిలిగ కొనియాడుచు కాలకృత్యముల దీర్చుకొని స్నాతలై అన్నపూర్ణా విశ్వనాథులకు పున: పున: ప్రణామంబు లాచరించిన పిదప నా క్షేత్రము నందు ప్రసిద్ధులైన విశాలాక్షి దుండివినాయకుడు కాలభైరవుడు మొదలైన దేవతామూర్తులను దర్శించిరి. అన్నపూర్ణాలయ మందలి గాయత్రీ విశ్వకర్మ లనదగిన కంచు పోత విగ్రహములను తిలకించి యానందించిరి.

అనంతరమున త్రివేణీ సంగమము నందు స్నాతలై హరిద్వారమున- ఋషీకేశమున నున్న విష్ణు మూర్తులను- కేదారమున కేదారేశ్వరుని- బదరీ నారాయణుని- పండరి రుక్మాబాయి విఠోబాలను సేవించి- నర్మద తపతీ నదులలో స్నానములు సేసి- ద్రాక్షారామంబున మాణిక్యాంబా భీమేశ్వరుల నారాధించి- పట్టశ వీరభద్రస్వామిని సేవించిరి.

విజయవాడ కృష్ణలో స్నాతలై ఇంద్రకీలాద్రి మీద నున్న విజయేశ్వరుని కనకదుర్గా మల్లేశ్వరులను- సీతానగర మందలి రామాలయంబును. మంగళగిరిలోని లక్ష్మీనరసింహమూర్తి; పానకాల రాయ స్వాములను

దర్శించిరి.

కాళహస్తి క్షేత్రమున స్వర్ణముఖీ నది స్నానములు చేసి ఈశ్వర నామ లింగమాది జ్ఞానప్రసూనాంబలను దర్శించి హరిహర క్షేత్ర మనంబడు కాంచిపురమందలి కామాక్షిని, ఏకామ్రేశ్వరుని దర్శించి బంగారు వెండి బల్లులను తాకిరి. మధురలోని మీనాక్షిని సందర్శించిరి.

శ్రీరంగమున ఆండాలమ్మ రంగనాయకులను- రామేశ్వరమున స్వయం భూలింగమును- కన్యాకుమారి అమ్మవారిని- చిదంబరం నటరాజ స్వామిని- తంజావూర్ శివాలయములను- లేపాక్షి బసవన్నను దర్శించి మార్గమధ్యమున గల క్షేత్రముల దిలకించుచు తీర్థములలో మునుంగుచు మహాత్ములను సేవించుచు క్రమముగ పాలకొండకు చేరి స్వగృహంబున ఘనముగ అన్నదాన సమారాధనయు చేసిరి.

వారి కలలు ఫలించినవి- గౌరమాంబకు నెల తప్పినది.

## విశ్వనాథాచార్య జననము

చూలాలికి జరుగ దగిన వేడుక లతివైభవముగ జరిగినవి. తొమ్మిది నెలలు నిండి పదియవ నెల ప్రవేశించిన యొక శుభదినమున; అనగ క్రీ॥శ॥ 1794వ సం॥నకు సరియైన నందననామ సంవత్సర కార్తీక శుద్ధ పంచమీలు సోమవారం శ్రవణా నక్షత్రయుక్త మకర లగ్నమున గౌరమాంబకు పుత్రోదయమైనది. ఆ సమయమున శివాలయములోని గంటలు గణగణ మ్రోగినవి. ఆచార్యుల వారింట పండు వెన్నెలలు రంగు రంగుల ప్రకాశించినవి.

పురిటి దినములు గడచిన పదునొకండవ నాడు గౌరమాంబా వీరాచార్య దంపతులు తలంటు స్నానములు చేసి గృహము నంతయు గోమయముతో అలికి ముగ్గులు పెట్టించి ద్వారములందు పచ్చాకు తోరణముల గట్టించి వివిధాలంకారములు విశేషంబులుగ చేయించి సమస్త బంధుమిత్రాదుల రావించి పీటలమీద గూర్చుండి వైదిక క్రియలతో పుణ్యాహవాచనం జరుపు కొని కుమారునకు "విశ్వనాథాచార్య"లని నామకరణం చేసిరి.

ఆడుంగ పాడుంగ- అల్లారు ముద్దుగ పెరుగంగ విశ్వనాథునకు పన్నెండేండ్లు నిండినవి. కన్నకుమారుని కల్యాణ మహోత్సవము నైన కనుల చూచుకొన నోచుకొనని ఆ తల్లి గౌరమాంబ శాశ్వతముగ కన్నుమూసినది.

అర్ధాంగ లక్ష్మివంతు బాధ్యతలు గూడ తనవే నన్నట్లుగ వీరాచార్యులు తల్లి లేని కొరత కనపడ కుండ తనయుని పెంచుచుండ వానికి పదహారేండ్లు నిండినవి. విశ్వనాథం తండ్రి యొద్దనే విద్య నభ్యసించి; వేదశాస్త్ర పురాణేతిహాసంబుల పఠించి; స్వర్ణ శిల్పము నందు సమర్థుడై రససిద్ధులందును ప్రతిభాశాలి యయ్యెను. కాలగమనమున వీరాచార్యులకు సంక్రమించిన అనారోగ్య మింతయు వెనుకాడక నానాట వృద్ధి పొందినది. తనకది అంత్యదశ యని గ్రహించిన వీరయోగీంద్రులు అన్నగారి కుమారుని చేర బిలిచి "నీలాచార్యా! నీ

తమ్ముడీనాడు తల్లితోబాటు తండ్రిని గూడ గోల్పోవుచున్నందున నికమీద వాని మంచి చెడ్డ లన్ని నీవే చూడవలయు"నని కన్నీరు నింపెను.

నీలాచార్యులును సవినయంబుగ "చిన్నాన్నా! మన విశ్వనాథమును నేను వేరు చేయుదునా? నాతో బుట్టిన తమ్ముని చందమున చూచుకొనెదనని ప్రమాణం చేయుచుంటిని. మీకా చింత వల" దనుచుండగనే వీరాచార్యుని ప్రాణవాయువు లనంత వాయువులలో కలసి పోయినవి. అనంతరమున జరుగవలసిన కర్మాదులును యథావిధిగ పూర్తియైనవి.

విశ్వనాథున కిప్పడు వదిన కామేశ్వరి అన్న నీలాచార్యులే తల్లిదండ్రులై నందున అన్నచాటు తమ్ముడయ్యెను. విశ్వనాథుడు కారణ జన్మధారి కనుక వాని దృక్పథము వేరుగ పయనించుచున్నది. వాని ప్రవృత్తి లౌకిక వృత్తుల కంటుక దూరమగుచున్నది. అనుక్షణము పరాధీనమైన మనసు- ఆసక్తి లేని వృత్తి విద్య- వేదాంతోపన్యాసము లందాసక్తి - వయసును మించిన వైరాగ్యము. ఆయన మాటలలోని అంతర్గతము లైన అమూల్యార్థములం దనుభవము లేని బంధుమిత్రాదులు "వీనికీ పిన్నతనము నందె యింత పెద్ద విషయంబు లెందు?" కని విమర్శించు చుండిరి. నీలాచార్యుని హృదయమున నిలకడ లేని యాందోళన చెలరేగినది. ఒక వంక తమ్ముని వైఖరి తగునని సమర్థింప లేక- మరొకవంక తల్లిదండ్రులు లేని తనయుని మందలింపను లేక సంకటంబున బడి సతమత మగుచుండెను.

అవతార పురుషుడైన విశ్వనాథాచార్యునకు తన కర్తవ్యము నెరవేర పరిసర వాతావరణ మనుకూల మగుటలేదు. అడుగడుగున నంతరాయము లగు చున్నందున బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సమస్త దేవగణముల కాదిదైవమును, సర్వ జగన్నియామకుడును; సమస్తమునకు కూటస్థుడునైన శ్రీ మద్విరాట్ విశ్వకర్మ పరమేశ్వరుని అనుమతి పొందుటవసరమని తలంచెను.

ఒకనాటి బ్రహ్మముహూర్తము నందె మేల్కాంచిన విశ్వనాథుడు కాలకృత్యముల దీర్చుకొని గ్రామమునకు తూర్పు దిక్కున నున్న జంగాల చెఱువునకు పోయి పరిశుభ్రముగ స్నానమొనరించి సంధ్యావందన మాచరించిన పిదప విశ్వకర్మ భగవానుని మనసార ప్రార్థింప నమ్మహనీయుండు మహాతపస్వి రూపమున బ్రహ్మతేజోమూర్తియై గగన యానమున నరుదెంచి తటాక మధ్యభాగమున నీటిమీద తేలియాడుచు తామర పద్మ మందాసీనుండయ్యెను.

అదిగాంచి విశ్వనాథు డమందానంద డెందంబున నీట దిగిపోయి వినయంబున నమస్కరించుచు తలవంచి నిలచియుండ నా గాయత్రీ కళత్రుండు మందహాస వదనారవిందమున తమ కుడిచేతిని విశ్వనాథుని తలపై నుంచి 'శీఘ్రమేవ సంపూర్ణ సంకల్ప సిద్ధిర"స్తనుచు నాశీర్వదించెను.

అనంతరమున –

# హస్తమస్తక సంయోగము



మహా తపస్వి రూపమున నరుదెంచిన విశ్వకర్మ పరమేశ్వరుడు విశ్వనాథుని తలమీద తమ కుడిచేయి నుంచి "నీవు కైలాసపతి యైన శంకరుడవు కాని; కేవలము మానవమాత్రుడవు కావు. నాడు గౌరమాంబా వీరాచార్య దంపతుల కిచ్చిన మాట నెరవేర నీ భూమి యందు దయించితివి.

ప్రస్తుతము మానవదేహ ధారి వైనందున నిన్నావరించిన మాయ తెర తొలగించితిని. ఇక నీవు నీ శివలీలలు ప్రదర్శింపుము. నీ యందు నిక్షిప్తమై యున్న నీ శివశక్తిని నీవు పొందగలవు. ప్రజలకు నీ త్రినేత్ర ప్రభావమును చూపెదవు. పార్వతిని నీ యందు ప్రత్యక్షముగ చూపి శ్రీసనారీ విశ్వేశ్వర నామమున సంస్తవనీయుడ వయ్యెదవు. శాపానుగ్రహశక్తి కలిగి ప్రకాశించెదవు. అనంతరమున శ్రీశైలము నందనంత తపస్సమాధి నొందెద"వని చెప్పి అదృశ్యుడయ్యెను.

విశ్వనాథుని యందుండియు లేనట్టు లున్న మహత్తర తేజ మంతట మబ్బు విడిచిన సూర్యబింబము వలె ప్రకాశించినది.

# అది మంచుకొండ ఇది పాలకొండ



అది మొదలు విశ్వనాథుని జీవితము నందాశ్చర్యకరమైన నూతన శక మారంభమైనది. ఆయన పలికిన ప్రతి పలుకు పరమార్థ మగుచున్నది. ఆయన చెయి దాకిన చిల్లరరాయి ఏదయిన శివలింగ మగు చున్నది. అది మంత్రమొ - తంత్రమొ మంది కర్థ మగుట లేదు.

నేనే కాశీపతిని - నిజమైన కైలాస పతిని. నే నపుడున్న మంచు కొండ తెలుపు - ఇపుడున్న పాలకొండ తెలుపు. తెలుపు తెలుపుల కలయిక తెలియ చెప్ప చున్నను తెలిసి కొన (లే) రీ తెలివి తక్కువ వా"రని విశ్వనాథ మనుచుండ కొంద "రితనికి పిచ్చి" అనిరి. మరి కొందఱు "ఉత్త పిచ్చి కాదు. మద పిచ్చి" అనిరి. ఇంకను కొందఱు "కాదు కాదు బూటకం నాటకం" అనిరి. కొద్దిమంది మాత్రం "ఇది మహాత్ముల మొదటి లక్షణ" మనుకొనిరి.

ఎవరేమన్నను విశ్వనాథం వెనుకాడ లేదు. తండ్రి చేసిన వృత్తి - తనకు నేర్పిన విద్య బంగారపు పని బ్రతుకు దెరు వన్నట్లు కనపడుచుండ కాలం గడచి పోవు చున్నది.

# విశ్వనాథుని వేదాంత సందేశము



విశ్వనాథం గారి వింత ప్రవర్తన చూచిన వారిలో విపరీత వ్యాఖ్యానములు బయలు దేరినవి. చిన్ననాటి స్నేహితులు కొందఱు చేరవచ్చి "ఒరేయ్! విశ్వం! దేవుని గుఱించిన మంచి మాటలు మాకు నాలుగు చెప్పరా! మేమును వినగల"మని యడిగిరి.

"దేవుడు చాల మంచివాడు. గొప్పవాడు. న్యాయకారి. మానవుని మాదిరి మాయకు భ్రమకు వశపడని వాడైనందున సర్వదా సర్వథా వందనీయుడు. పక్షపాతం లేని ప్రతివారి బంధువు. ఆయనకు పుట్టు గిట్టుటలు లేవు. ఒకనాడుండి యింకొకనాడు లేనివాడు గాని; ఒకచోట నుండి యింకొక చోట లేనివాడుగాని కాని శాశ్వతుడైన సర్వాంతర్యామి. పరమేశ్వరుని విజ్ఞానమునకు ప్రతిరూపం వేదం. వేదసూక్తులను విస్మరింపక నీతి మార్గమున నిత్య జీవనము చేయువారికి మోక్షసామ్రాజ్యము ముందున్నది. నారాయణుని నమ్మిన వారు నష్టపడరు. మరల మరల మానవ జన్మ రాదు. జాగ్రత్త గలిగి జన్మరాహిత్యం పొందవలయు"నని విశ్వనాథం చెప్పగ కొందఱు మెచ్చుకొన్నారు - మరికొందఱు నొచ్చుకున్నారు.

# అన్నపూర్ణమ్మ తల్లి ఆశయము



పాలకొండకు ఇరవై మైళ్ల దూరమున నున్న సుప్రసిద్ధ గ్రామం సుమంగళీపురం. భ్రమరాంబ బ్రహ్మానందాచార్యు లను విశ్వబ్రాహ్మణ దంపతు లాదర్శప్రాయులు. వారికి లేక లేక కలిగిన ఏకైక పుత్రిక అన్నపూర్ణ. అన్నపూర్ణ అందచందాల అపరంజి బొమ్మ. ఆటపాట లందు - చదువు సంస్కారము లందును సాటి లేని మేటి బాల. కన్య పెరుగుచున్నది - కల్యాణ తరుణం సమీపించుచున్నది.

సంప్రదాయం గల సంబంధం కొఱకు పని గట్టుకొని పదిమందిని కలియుచున్న కన్నవారితో "వరాన్వేషణకై మీరు వ్యయ ప్రయాసలు పడవలదు. నా భర్తయైన నాగాభరణుడే మన యింటికి రానున్న మంచి రోజు ముందున్నది. కాలం వచ్చిన కల్యాణ మాగ"దని ముద్దు ముద్దుగ చెప్పినదా ముద్దరాలు.

అమ్మాయి మాట లమ్మనాన్నల కాశ్చర్యమును కలిగించినవి. అన్నపూర్ణ అమాయకురాలు కాదు. ఆమె చెప్పిన మాటలు అక్షరసత్యము లగుచున్నవి. నిదానించి నిజం తెలిసికొనవచ్చు ననుకున్నారు తలిదండ్రులు. కొద్ది రోజులు గడచినవి.

# విశ్వనాథాచార్య వివాహము



అన్న నీలాచార్యుని మనసులో అందోళన చెలరేగినది. తత్త్వ విచారణలలో తలమునిగిన తమ్మున కికముందు పిల్ల నిచ్చెడి పిచ్చివాడుండడను బెంగ పీడింప సాగినది "కాలం గడవక ముందె కన్యను విచారించి ఒక యింటివానిని చేయుట యుత్తమ" మను కొనెను.

సుమంగళీ పురము నందున్న బ్రహ్మానందాచార్యుల వారితో వియ్యం కుదిరినందున చి॥ల॥సౌ॥ అన్నపూర్ణా విశ్వనాథాచార్యుల వారి పాణిగ్రహణ మహోత్సవం శ్రీముఖినామ సంవత్సర వైశాఖ శుద్ధ ఏకాదశీలు శుక్రవారం ఉత్తరా నక్షత్ర యుక్త కర్కాటక లగ్నమున వైభవముగ జరిగినది - పెండ్లి వేడుకలన్ని ఘనముగ నడచినవి.

అన్నపూర్ణ కాపురమునకు వచ్చి మూడేండ్లు గడచిన మీద విశ్వనాథం అన్నగారి అనుమతి ననుసరించి వేరే క్రొత్త కాపురం పెట్టెను. ఆ యింట గృహస్థాశ్రమ ధర్మములు చోటు చేసికొనినవి. ఎవరైనను - ఎపుడైనను వచ్చిన అతిథుల కాశ్రయం లేదన్నవారు గాని - విన్నవారు గాని లేరు. అది నిజమైన అన్నపూర్ణా నిలయం.

# అక్షయాన్నదాన మాహాత్మ్యము



పతికి దగిన సతీమణి అన్నపూర్ణ. నిత్యం జరుగుచున్న దానధర్మాలతో ఆ యిల్లు కళకళ లాడుచున్నది. పూజలు, పుణ్య కార్యాలు జరుగని రోజు లేదు. విశ్వనాథం పేరు వేనోళ్ల వినబడుచున్నది. ఉన్నతిని చూచి యోర్వలేని సమాజం వారికి "వీని నెట్లయిన పరాభవించి తీరాల" ననే యోచన - కుట్ర లేర్పడినవి.

ఒకనాడు కొన్ని వందల మంది సాధువులు పాలకొండకు వచ్చి - అక్కడక్కడ దాగి యుండి ముందుగ కొందఱు మాత్రం విశ్వనాథం గారింటికి వచ్చి తిష్ఠవేసిరి. అది గ్రహించిన స్వాములవారు "అన్నపూర్ణా! అతిథులు వచ్చిరి. నీ పేరు నిలబెట్టుకొ"మ్మనగ నా తల్లి "విశ్వనాథులవారి ఆజ్ఞ" అని అందఱిని పిలిచి ఇష్ట మృష్టాన్నములు వడ్డింపగ వారు తృప్తిగ భోజనాలు చేసి లేచిరి. అంతలో మరి కొందఱు వచ్చిరి. ఆ తరువాత మరి కొందఱు వచ్చిరి. అంచలంచలుగ వచ్చిన వారందఱకు అన్న సంతర్పణ జరిగి నందున భోక్తలు "అన్నదాత సుఖీభవ" అనుచు ఆనందముగా తిరిగి పోయిరి.

# విశ్వనాథుని విశేష ప్రతిభ



ఒకనాటి ఉదయమున విశ్వనాథం జంగాల చెఱువుకు పోయి నీటిమీద తామరాకు పరచి దానిమీద కుర్చుండి తటాక మధ్యభాగమునకు వచ్చి మునిగిపోయెను.

అంతకుముందె చెఱువు రేవున స్నానములు చేయుచున్న వీరయ్య యను వైశ్య శ్రేష్ఠియు, సోము లను రజక కులాగ్రణియు నా దృశ్యమును కన్నులార చూచి "అయ్యో! ఈ పిచ్చి విశ్వనాథ మన్యాయముగ నీట మునిగిపోయినే" అనుకొనుచుండ స్వాములవారు మరల నీటిమీదకు తేలి సంధ్యావందనం ముగించుకొనిన పిదప గట్టునకు వచ్చి ప్రక్కనున్న రామలింగేశ్వర లింగము నారాధించెను.

స్వామి చర్యలను స్వయముగ చూచిన వీరయ్య సోము లిద్దరును ఆచార్యులవారు దైవాంశ సంభూతు లని నమ్మినందున సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి "మహాత్మా! మమ్ము తమ శిష్యులుగ స్వీకరించి మాకు తరుణోపాయము చూపు"డని ప్రార్థించిరి. ఆశ్రయించిన వారి నామహనీయు డనుగ్రహించెను.

# కులమత రహిత గురుకులము



శ్రీ విశ్వనాథాచార్య స్వాముల వారి గృహమొక గురుకులాశ్రమ రూపురేఖల సంచరించు కొన్నది. శిష్యులేగాక ఆధ్యాత్మిక చింతన గల మరికొందఱు భక్తులును తండోపతండములుగ వచ్చి ఆచార్యోపన్యాసంబుల నొలకించుచుండిరి - అభినందించు చుండిరి. అచట కులమతముల తరగతులు లేవు - ధనిక పేదలకు గొప్ప కొద్ది పీటలు లేవు.

విశ్వనాథుల వారు విపులముగ వివరించుచున్న పిండోత్పత్తి క్రమము; షట్చక్ర వివరణ; సూక్ష్మ కారణ దేహ స్వరూపము, కాల ప్రమాణము, చతురాశ్రమ విధానము; ఛాయా పురుష లక్షణము, ప్రాణాయామ సాధనము మొదలైన వేదాంత రహస్యముల వినినవారందఱు పరమానందం పొంది ప్రస్తుతించు చుండుట చూచి సంఘంవారు సహించలేకపోయిరి.

స్వాముల వారీ సంఘీయుల ఆగడము లన్ని చూచియు చూడనట్లు వినియు విననట్లు తెలిసియు తెలియనట్లు నటించుచుండిరె కాని ప్రతిపక్షులపై పగచూపుటలేదు - పంతము లాడుట లేదు.

ప్రజ్ఞావంతులు ప్రగల్భము లాడరు.

# వెలిబెట్టిన కులబంధువులు



విశ్వనాథాచార్యులు విశాల హృదయమున చాకలివానిని చేరదీసి- కులము కాని కులము వారిని కూడగట్టుకొని - బ్రాహ్మణేతరులకు బహిరంగముగ వేదమంత్రార్థములు విప్పి చెప్పటయు కులపెద్దలకు కోప కారణమై "విశ్వనాథం! మన సాంప్రదాయముల మన్నుపాలు చేసిన నీవు తప్ప తాంబూలం పెట్టు. లేదా - నీకు కులబహిష్కారం తప్ప"దని వెలిబెట్టిరి- వెక్కిరించిరి.

నీలాచార్యుని కాలు నేలమీద నిలవ (లే)క పోయినది.

అందుకు తోడుగ ప్రక్క వీథి యందున్న బ్రాహ్మణులును మరింత పురిగొల్పినందున విశ్వబ్రాహ్మణులు కొలువు దీరి "అసలీ విశ్వనాథ మాచార్యుడెట్లయ్యెను? వేద పాండిత్యము వీని కెక్కడిది? అతడు చెప్పచున్న సిద్ధాంతములే గ్రంథము లందున్నవి? లేవు. వాని దంతయు చేతబడి చేయువాని తంతు, తెలిసి తెలియని గురువుల ఉపదేశం పొందిన వారికి ఉచ్ఛిష్ట నరకం తప్ప"దని ప్రచారం చేయుచున్నను స్వామి కొంచెమైనను జంక లేదు - గొంక లేదు.

# అఖండాన్నదాన సమారాధన



పాలకొండ లోని అన్నవరమున విశ్వనాథాచార్యుల వారు విధివిధానంబుగ రామలింగేశ్వరస్వామి ప్రతిష్ఠ చేసిన సందర్భముగ ఐదవ దినమున అన్న సంతర్పణ చేయ నియమింప బడినది.

స్వామిని పరాభవము చేయు నిది సమయ మనుకొనిన విశ్వబ్రాహ్మణులు జట్లు జట్లుగ ప్రతి గ్రామమునకును బోయి "మా పాలకొండలో! జరిగిన దేవతా ప్రతిష్ఠ సందర్భమున అఖండాన్న సంతర్పణ చేయబడు చున్నది. మిమ్మందఱను పిలిచి కొనిరం"డని కార్యకర్తలు మమ్ము పంపించిరని చెప్పినందున పల్లెల నుండి పట్నాల నుండి వచ్చిన ప్రజలతో నగరం నలుమూలలు నిండిపోయినవి.

వండించిన పదార్థములు చాలక పాత్రలు వట్టిపోయినవి. ఇంకను తినవలసిన వారెందఱో మిగిలి యున్నందున స్వాముల వారా పాత్రల మీద మూతలు పెట్టించి కమండలోదకం ప్రోక్షించి నంతనే తిరిగి పాత్రలన్నియు పదార్థములతో నిండి వచ్చిన వారందఱకు భోజనములు లభించినవి. కుళ్లు బోతుల కొక గుణ పాఠం చెప్పి నట్లైనది.

# ప్రాణాయామములో పరమపదము



అన్నపూర్ణాదేవి భర్తగారి చెంతనే యోగవిద్య నభ్యసించి; ఒకనాటి ప్రాణాయామ స్థితిలో పరమపదం చెందినది. ఆ వార్త సోము లందఱకు చెప్పినను ప్రజలెవ్వరు పరామర్శింప రాలేదు. కులంవారు కన్నెత్తి చూడలేదు. సంఘం వారి బెదిరింపులకు భయపడి అన్నగారటు తొంగిచూడనులేదు.

చీకటి ప్రాకినది. అమ్మవారి బొందిని స్వాములవారే దుప్పటిలో చుట్టి బుజమున పెట్టుకొని సోములు దివిటీ చూపుచుండ స్మశానమునకు పోయి శవస్థాపన చేసి వచ్చిన పిదప. నట్టింట చతికిల బడియుండ అమ్మవారు కంటిముందు కనపడి "ఏమండీ! మీ యర్థాంగ లక్ష్మిని నన్నింటి నుండి దూరం చేయుదురా!" అనినంతనే స్వాముల వారి హృదయం కరగి ద్రవించినది. చివాలున లేచి మరల సోములు చూపుచున్న దివిటీ వెలుగున స్మశానమునకు పోయి పూడ్చబడిన ప్రేతమును పెకలించుకొని వచ్చి తమ యింటిలోనే సమాధి చేసిరి.

అప్పటికి తెలతెలవారినది. ఈ వార్త ఊరంతట పాకినది. ఇటింట గుసగుసలు బయలు దేరినవి.

# ఆధారము లేని అభియోగము



వల్లకాటిలో పాతిపెట్టిన శవాన్ని తెచ్చి వంటింటిలో పూడ్చిపెట్టినాడీ దిక్కుమాలిన విశ్వనాథం-ఆమె దయ్యమై అందఱను మ్రింగక నూరక నుండదనే భీతితో ఊరంతా ఉడికిపోయినది. కామందు లందఱు కలసి కట్టుగ పోయి కలెక్టరు గారితో చెప్పకొనిరి.

నేరం విచారింప వలసిన న్యాయాధికారి ముందుగ రాజా అనంద గజపతుల వారిని సంప్రదించి స్వాములవారిని పిలిపింప గోరెను. రాజా వారంతట "స్వాముల వారు సామాన్యులు కారు. మనమే వారింటికి పోవుట మంచి"దని చెప్పి ముందుగ అనుమతి పొందిన పిమ్మట అందఱును విశ్వనాథం గారింటికి పోయి చూచిరి. ఎక్కడెక్కడ వెదకి చూచినను ఎవరి కేమియు కనుపించలేదు. "ఎందుకు వచ్చితిరి? - ఏమి చూచితిరి? అని ప్రశ్నించిన స్వాముల వారికి తిరిగి క్షమాపణ చెప్పకొని వీధిలోనికి వచ్చిన అధికారులు ఆధారములు లేక ఇక మీదిట్టి చేతగాని పనులు చేయవద్దని నేరారోపణ చేసిన వారిని చివాట్లు పెట్టిరి. తారసిల్లిన పెద్ద లంతట తలలు వంచక తప్పలేదు.

# అపర్ణాదేవి యైన అన్నపూర్ణ



విశ్వనాథాచార్యులవారు వీధిలోనికి వచ్చి "మీరు మా అన్నపూర్ణను చూడగోరుచుంటిరా!" అనగ అందఱును ఔనన్నట్లుగ తలలాడించిరి. "అటులైన మీరీ గదిలోనికి పోయి చూడవచ్చు" నని స్వాముల వారు తలుపులు తెరచిరి. రాజా ఆనందగజపతి, అధికారి, ఊరి పెద్దలా గదిలోనికి పోయి చూచినపుడు వారి కన్నులనే వారు నమ్మలేకపోయిరి.

రత్నకిరీటం ధరించి; త్రిశూలం చేతబట్టి; సింహవాహన మెక్కి యున్న దుర్గాదేవి వారికి దర్శన మిచ్చినది. అంతేకాదు స్వాములు వారి సహధర్మ చారిణి యైన అన్నపూర్ణాదేవి అచ్చు గ్రుద్దినట్లు అపర్ణాదేవిలాగ కనుపించినది. చూచిన వారి యొడలు జలదరించినవి. అన్నపూర్ణమ్మ తల్లి అపర పార్వతీ దేవ్యావతార మని పదిమంది ప్రస్తుతించిరి. "అపరాధం మన్నింపు"డని ఆచార్యుల వారి పాదములమీద బడగ స్వాముల వారందఱును సాదరమున కరుణించెను.

ఐనను ఆకతాయి వారి ఆట లంతట కట్టుబడ లేదు. కనపడిన వింతలు కనుకట్టు విద్యలని ప్రచారం చేయువారికి ప్రాలుమాలిక లేదు.

# చెప్పుడు మాటలు తెచ్చిన చేటు



విశ్వనాథ మిపుడు ఒంటరి. నీలయ్య భార్య నలువురు కుమారులు కుమార్తె గల కుటుంబీకుడు. పొరుగువారి ప్రోద్బలమున తమ్ముని గొట్ట తారసిలి నందున సహనం కోల్పోయిన స్వాములవారు "నీ యింట వాల్చిన మంచ మెత్తక వరుసగ మరణించెద"రని శపించెను.

అట్లే నీలాచార్యుని నల్వురు కొడుకులు నష్టపడిరి. మిగిలిన కుమార్తె మంచ మెక్కినందున కామాక్షమ్మ వచ్చి మరదిని క్షమాపణ కోరినది. మహాత్ములు మన్నించి "జరిగిన దేదో జరిగిపోయినది. మీ యింట వాల్చిన మంచం లేవదు కనుక అమ్మాయి మంచం మా యింటికి చేర్చ" మనిరి. అట్లే చిన్నాయన గారింటికి వచ్చిన భ్రమరాంబ ఆరోగ్యం పొంది యిక్కడనే యున్నది. తరువాత కుమార్తెకు వివాహం చేసి - శిష్యుడైన వీరయ్యకు తన యావదాస్తి స్వాధీన పరచి అన్నపూర్ణమ్మ గారి సమాధి యొద్ద నిత్య దీప ధూప నైవేద్యాదుల జరుప నియమించిన తదుపరి స్వాముల వారు సంచారం చేయబూని బొబ్బిలి సాలూరుల మీదుగ పయనించి కొలది దినములలో విజయనగరం చేరిరి.

గొప్పవారి తిట్టు గొడ్డలి పెట్టు.

# ఆ స్థాన శిల్పులందధ్యక్ష స్థానము



ఆ కాలమున విజయనగరమును శ్రీ పూసపాటి విజయరామ గజపతులు పాలించు చుండిరి. విశ్వనాథ స్వాముల వారా విజయనగరం చేరి ప్రభుత్వ సైనిక శిక్షణా కేంద్రమునకు సమీపము నందొక పర్ణశాల నిర్మించుకొని యుండగ నిత్యము వచ్చిపోయెడి వారివలన స్థానికుల కంతరాయము లేర్పడినవి.

ప్రభువుల కావార్త విన్నవించుకొన బోయిన కేంద్రాధికారియే స్వాములవారు విభూతి బొట్టు; రుద్రాక్షమాల; కాషాయాంబరం; కమండలువు; యోగదండం; పాదుకలు ధరించి యుండిరని వివరించి నందున రాజావారు స్వామిని చూడ బోయెను. ఆ అవధూతల వారి అపర శంకరావతామును స్వయముగ తిలకించిన గజపతులు పాదాభివందనం చేసి పల్లకిలో నెక్కించుకొని పోయి రాజాస్థాన శిల్పుల కధ్యక్షులుగ నియమించిరి. స్వాముల వారికి రాజసభా భవనంబున ప్రత్యేక గురుస్థానం లభించినది. విశ్వేశ్వరుల వారు గీచినగీటు విజయరామ భూపాలురు దాటుట లేదు. స్వాముల వారి వేదాంత ప్రసంగములు జరుగు చున్నవి.

# పల్లేరు కాయల ప్రభావము



సింహాద్రి విశ్వనాథావధూత స్వాముల వారికి జరుగుచున్న రాజ మర్యాదలు చూచిన కొందఱు మంత్రులకు కన్ను కుట్టినది. ఎట్లయినను స్వామిని పరాభవింప నెంచినందున కొలువు పనివారిని గట్టు కొని ఆచార్యులవారి పీఠంమీద పల్లేరు కాయలు పోయించి పైన కనపడకుండ పట్టు వస్త్రం కప్పించిరి.

దినచర్య ననుసరించి రాజసభకు విచ్చేసిన స్వాములవారు కుట్రదారులు చేయించిన కొంటెపని గ్రహించి నందున పల్లేరుకాయలను మల్లెపూలుగ మార్చి సుఖాసీను లైరి. సభానంతరం స్వాములవారు చేటు తలపెట్టిన వారిని చేరబిలచి “నాయనలారా! నా పీఠము మీద పూలు పోయించిన మీ పుణ్య మూరక పోదని చెప్పి వెళ్లిపోయిరి. ద్రోహం తలచిన దుర్మార్గులు మన నుండి లంచం పుచ్చుకొనిన మోసగాండ్రు నిజముగ పూలే పోసియుందు”రని భ్రమించి వానిని దోసిళ్ల లోనికి తీసికొని నంతనే మల్లెపూలు మండ్రగబ్బలుగ మారి వారిని కుట్టినవి. తిరిగి వారు స్వాముల వారిని ప్రార్థించి బాధా విముక్తు లైరి.

# పాదుకాపహరణ ఫలితము



ఆస్థాన విద్వాంసు లందొకనికి విశ్వనాథం ధరించెడి పాదుకల ప్రభావంబున వాని కింత రాజపూజితం లభించు చున్నదె కాని వాని స్వయంప్రభ కాదని పించినది. ఆ కారణమున నెట్లెట్లో శ్రమించి స్వాముల వారి పాదుకల నపహరించెను. మరునాడందరి కన్న ముందుగ రాజావారి కోట ముఖ ద్వారం చెంత నాత డేదియో యోచించుచు నిలుచుండెను.

ఆచార్యుల వారు పాదచారియై వచ్చుచుండ నా విద్వాంసు డెదురై "స్వామీ! పండితులైన తమరు పాదుకలు లేక పాదచారులై రారా" దనుచునే సాగి పోయి తన స్థానమున గూర్చుండెను. అవధూతల వారంతట వాయువిద్యా ప్రభావమున గజమెత్తు పైకిలేచి కాలిక్రిందెటువంటి ఆధారము లేక పోయినను నేలమీద నడచినట్లు నడచిపోయి వారి పీఠము ముందు క్రిందికి దిగి కూర్చుండెను.

స్వాములవారి ప్రతిభ గుర్తించిన విద్వాంసు డపుడు ఆచార్యుల వారే శపించెదరో - ప్రభువుల వారే దండించెదరో నను భయమున వచ్చి పాదాక్రాంతుడై ప్రమాదము నుండి తప్ప కొనెను.

# కలకాలం కష్టము ఉండదు



విజయనగర సామ్రాజ్యమునకు శృంగవరపుకోట తాలూకా దేవులపల్లి సామంత రాజ్యం. ఆ గ్రామ మందలి పద్మశాలి వంశమునకు చెందిన ఘంటా సీతప్ప నిత్య శివపూజా దురంధరుడు. దానధర్మ పరాయణుడు. పాండిత్యమున గర్భ కవిత్వము, బంధ కవిత్వము, చిత్ర కవిత్వముల చెప్పనేర్చిన దిట్ట. శ్రీమంతుడు. బంధు మిత్రాదుల వలన సింహాద్రి విశ్వనాథావధూత స్వాములవారి స్థితప్రజ్ఞ నెరింగి - వారిని కేవలం దైవాంశమూర్తులుగ నమ్మి త్రికరణ శుద్ధిగ నారాధించుచున్న భక్తుడు.

ఒకప్పుడు వానలు కురియక పైరులు పండక శిస్తు చెల్లింపనందున ప్రభుత్వంవారు సీతప్పను చెఱశాల యందుంచిరి. అదే సమయంబున గజపతులు రాజకార్యం మీద దేవులపల్లి వెళ్లుచు గురువులను వెంట బెట్టుక పోయిరి. స్వాములవారపుడు కారాగారము నందున్న సీతప్పకు దర్శన మిచ్చి "పన్ను చెల్లింపక పోవుట నేరమైనను స్వయంకృతాపరాధివి కానందున నీవు విడుదల చేయబడెద" వని చెప్పిరి. ఆమరునాడే సీతప్పకు బంధ విముక్తి కలిగినది.

# ఉంగరము చేయ నిచ్చిన బంగారము



ప్రభువు లొకనాడు "స్వామీ! మీరు ప్రసిద్ధ తపోధనులు. మీ దివ్య శక్తిని మేళవించి మాకనంత విజయము సిద్ధించు నట్లుగ నవరత్నాంగుళీకము చేసి యిం"డని కోరెను. స్వాములవారు సమ్మతించి "రాజా! చేయుదును. కాని ఒక నిర్ణయము. ఎన్నినాళ్ల కయినను నేనిచ్చినపుడుగాక తొందరపడి నీవడుగరా" దనిరి. గజ పతులట్లేనని బంగారము నవరత్నములు గురువుగారి కిప్పించిరి.

ఆరు నెలలు గడిచినవి - పని ప్రారంభము కాలేదు.

అసూయా పరులైన ఆస్థాన శిల్పులు రహస్యముగ రాజుగారిని కలిసి "ప్రభూ! విశ్వనాథం గారింతవరకు తమ యుంగరపు పని ముట్టలేదు. కారణము తెలియదు. ఏలినవారి గ్రాసం తిని బ్రతుకుచున్న సేవకులం. మాకు తెలిసిన దానిని మీకు చెప్పక పోయిన యెడల రాజ ద్రోహుల మయ్యెద మని చెప్పితిమి. తరువాత దేవరవారి చిత్త" మని తలలు వంచిరి. మహారాజా వారి మనసు మారినందున మాటాడలేదు.

మౌన మర్ధాంగీకార మని శిల్పు లభిప్రాయ పడిరి.

# పల్లవ బాలుని ప్రాణాయామము



విజయ నగరాధీశ్వరులకు ఎలకొండ మీద విశ్రాంతి భవనము లున్నవి. విహారార్థ మచటి కేగుచున్న గజపతులు విశ్వనాథం గారిని గూడ వెంట తీసి కొనిపోయిరి. ఆచార్యుల వారపుడు అమనస్కాది వేదాంత రహస్యములతోబాటు జాడ్యనిద్ర యోగనిద్రలనె గాక సాధన ప్రక్రియలను గూడ సాంగోపాంగముగ ప్రభువుల వారికి బోధించెను.

పచ్చిక బయళ్లతో పశువులను మేపుకొన వచ్చిన యాదవ బాలుడు చాటున నుండి స్వాములవారు చెప్పిన సాధన క్రియల నన్నింటి నాలకించి యోగాభ్యాసమున కుపక్రమించెను. వాని పూర్వజన్మ పుణ్య ప్రభావంబున ప్రాణాయామము సిద్ధించినది. ఆయనిపుడీ బాహ్య ప్రపంచము తెలియని యోగ నిద్ర యందుండెను. కుమారుని జాడ తెలియక వెదికి కొనుచు వచ్చిన తల్లిదండ్రు లాయనను చూచి దు:ఖించుచుండ స్వాములవారు వచ్చి సమాధ్యవస్థ యందున్న బాలయోగిని మేల్కొల్పెను. విజయరామ గజపతుల వారానందించి యాదవ బాలయోగీంద్రునకొక మున్యాశ్రమం నిర్మించి బహూకరించెను.

# పరబుద్ధి పతనహేతువు



విజయనగరం - రాజ సభా భవనం. మంత్రు లందొకరు లేచి "విశ్వనాథాచార్యుల వారూ! ఉంగరం చేయ ప్రభువులు మీకు బంగార మిచ్చి ఆరు నెలలు దాటినవి. నవరత్నాంగుళీకమును ధరింప నభిలషించుచున్న పాలకు లెంతకాల మోపిక పట్టగలరు? ఇంత వరకు మీరెంతవరకు చేసితిరో మాకొకసారి చూపవలయు నని మిమ్మడుగలేక అడుగుచుంటి" మనెను.

మహారాజా మంత్రిని మందలింప లేదు.

ఆచార్యులవారి కసలు విషయ మర్థమైనది. గడ్డం సవరించుకొని గంభీర స్వరంతో "మీ కోరికను మేము నిరాకరింప నేల? అప్పటి మాట లిప్పుడు లేవు. లేకపోయిన లోపం లేదు. నాకు వచ్చిన నష్ట మంతకన్నను లేదు. నేడు కాదు - రేపు కాకపోదు. ప్రత్యేక వేదిక నిర్మించి పరజా కట్టించండి. పరజా వెనుక నొక బల్ల పదిల పరచండి. మీరందఱు మీమీ స్థానాలలో కూర్చున్న తరువాత నాపనితనం నలువురు చూడవచ్చు" ననిరి. అందుల కెదురు చెప్ప గల ధైర్యమెవరికిని లేక ఒకరి మొగము లింకొకరు చూచుకొని - గుటకలు మ్రింగిరి - గుట్టు చక్కగ లేచి పోయిరి.

# చేయిజారి పోయిన చిరోన్నతి



మరునాటి రాజసభలో మహారాజు మంత్రులు సామంతు లందఱు వారివారి యుచితాసనంబుల నలంకరించి యుండగ స్వాములవారా ప్రేక్షకుల నుద్దేశించి "ఉంగరమా తెరవెనుక నున్నది. ఇక చూడండి" అని ఒక మంత్రం చదువగ ఉంగరము నందమర్చబడిన వజ్రం లేచి తెరమీదకు వచ్చి ప్రకాశించిన వెలుగు తరంగములట్లు తేలిపోయినది. అట్లే అవధూతలవారు తొమ్మిది మంత్రములు చదువగ తొమ్మిది రత్నములు మాయమై పోయినవి.

తెరదీయగ రాళ్లు లేని ఉంగరము మాత్రమే అచ్చట నున్నది.

రాజా! ఒక్కొక్క నక్షత్ర లగ్న కాలములలో - ఒక్కొక్క బీజాక్షర మంత్రోపాసనలతో - ఒక్కొక్క రత్నము నీయుంగరంబున పొదిపి యుంచితిని. అనంత ఆయురారోగ్య విజయంబుల ప్రసాదింపగల ప్రాణ ప్రతిష్ఠయు చేసి నేనే నీ వ్రేలికి ఉంగరము తొడుగ నుంటిని. కాని నీకా యదృష్టం లేదు. నామాట మీద నమ్మకం లేని నీయొద్ద నుండ నాకవసరం లే" దని చకచక సభవిడిచి వెళ్లి పోయెను. ప్రభువు నోటి వెంట మాట రాలేదు. ఎక్కడి వారక్కడ దిష్టిబొమ్మలట్లు స్తంభించి పోయిరి.

# కట్టి లచ్చన్న చేసిన కైవారము




కొణిశ గ్రామంబున కట్టి లచ్చన్న యను పద్మశాలీల యువకుడుండెను. పసితన మందె తల్లి మరణించి నందున లచ్చన్న శృంగవరపు కోటలో మేనమామల యింట కొంతకాల ముండెను. ఆ సమయంబున సీతప్ప గారి శిశ్రూషచేసి చక్కని కవియై వివాహానంతరం తిరిగి యింటికి పోయి నేతపనిలో నిపుణుడై సుఖజీవనం చేయుచుండెను.

ఛందసు నేర్పిన గురువు సీతప్పగారిని చెఱ విడిపించిన దైవ స్వరూపులు విశ్వనాథాచార్యుల వారిని దర్శింప వాని ధ్యేయం. ఒకానొక దినంబున కొణిశ గ్రామము మీదుగ పయనించుచున్న స్వాములవారి కెదురేగి తన యింటికి తీసికొనిపోయి పాదపూజ చేసి నమస్కరించిన పిదప తన యుదంతం విన్నవించెను. "దేవా! మా గురువుగారిని భక్తునిగ కనికరించిన మీరు మీ శిష్యునిగ నన్నాశీర్వదించండి" అని ప్రార్థించెను. స్వాముల వారా లచ్చన్న భక్తి విశ్వాసాభిమానముల కెంతయు సంతసించి, వాని నుండి గురుదక్షిణ నందుకొని "సంకల్ప సిద్ధిర" స్తని దీవించెను

# హింస దేవతలకు హితముకాదు



విశ్వానాథాచార్యులవారు విశాఖపట్నం నుండి తిరిగి వచ్చుచున్న మార్గమునందలి రంపచోడవరం యొద్ద నొక దట్టమైన అడవి ఎదురైనది. అచట నొక కోయ పల్లె కాళికాలయము కనిపించినవి. స్వాముల వారా గుడి చెంత విశ్రాంతికై కూర్చుండి యుండ గూడెంలోని కోయ గుంపు తప్పెటలతో తందనాలతో త్రాగుచు తూలుచు వచ్చి అమ్మ వారిముందు కోళ్లను మేకలను బలీయబోయిరి.

స్వాముల వారా ఆటవికులను సమీపించి "నాయనలారా! అమ్మవారనగ అందఱకు అమ్మయే కద? ఈ జీవులు గూడ ఆమె బిడ్డలే. ఏ తల్లయినా తన బిడ్డలను తనే చంపుకొని తినగలదా? భూతదయ కన్న మించిన పుణ్యం లే" దని చెప్పినందున వారందఱకు జ్ఞానోదయమైనది. అయ్యా! ఈరోజున మీరు మా కన్నులు తెరిపించితిరి. ఇకమీద నెన్నడు హింస చేయము. అమ్మ తల్లికి పాలు పండ్లు సమర్పించి పూజించెదము. దొంగతనం మాని కాయకష్టం చేసి జీవించెదము. మద్యమాంసాహారాదుల మినహాయించి శాకాహారుల మయ్యెద" మని ప్రమాణాలు చేసిరి. స్వాములవారికి ద్రాక్ష ఖర్జూర ఫలముల నిచ్చి నమస్కరించి తిరిగిపోయిరి.

# ప్రయోజనము లేని ప్రచారం



విశాఖపట్నం నుండి బయలు దేరిన స్వాములవారు అన్నవరం దర్శించిన తరువాత రాయవరం వెళ్లి భూమంచి వేంకటరెడ్డి గారింటి ప్రక్క కుటీరము నందుండిరి. ఆచార్యుల వారి తపస్సు శ్రోత్రియము వేదవిద్య వాక్చాతుర్యముల కానందించిన ప్రజలు ప్రస్తుతించుచుండ స్థానికులైన బ్రాహ్మణుల కాయన యం దసూయా ద్వేషము లంకురించినవి.

రాయవరం బ్రాహ్మణులు పనిగట్టుకొని ప్రతివారి ముందు "ఆ విశ్వనాథ మొక పగటి వేషగాడు. మీ రాతని మాటలు నమ్మి మోసపోకండి. ఈ ప్రపంచ మంతయు దైవాధీనం - ఆదైవం మంత్రాధీనం - అట్టి మంత్రం బ్రాహ్మణాధీనం కనుక బ్రాహ్మణుడే మీకు దేవదేవుడని నమ్మి మమ్ము పూజించిన వారికే పుణ్యము పురుషార్థములు సిద్ధించు" నని ప్రచారం చేయుచుండిరి. తెలియని జనం తికమకలలో పడుచుండిరి.

ఈ మాటలు వేంకటరెడ్డి గారి చెవుల బడినవి. అసలీ వచ్చిన స్వాముల వారెవరు? ఈయనగారి శక్తి సామర్థ్యము లెట్టివో తెలిసికొనుట ఎందులకైన మంచిదని తలంచెను.

# రాయవరమున రామచిలుక



ఒకనాడు వెంకటరెడ్డిగారు స్వాములవారి నాహ్వానించి ఉచితరీతిని గౌరవించిన పిదప "మహాత్మా! మాయింటి రామచిలుక ఎంగిలి పదార్థముల ముట్టదు. కాని తమ యెంగిలి యనిన సేవగింపక భగవత్ప్రసాదమని భక్తి శ్రద్ధల నారగించుచున్న దేమి కారణ" మని యడిగెను.

ఆచార్యులవా రంతట "రెడ్డిగారూ! ఇది జన్మాంతర చరిత్ర. ఈ రామచిలుక పూర్వజన్మ యందొక క్షత్రియుడు. శివనామ మనిన గిట్టని వైష్ణవ మతాభిమాని. ఒకనాడింటికి వచ్చిన శివయోగికి ఎంగిలి పదార్థముల దినసీయగ నాతపస్వి "ఓయీ! ముందొక నాటికి నీకీ ఎంగిలియే గతి కానున్నదని శపించెను. క్షత్రియుం డంతట క్షమాపణ కోరగ శివయోగి కరుణించి "పునర్జన్మ యందు నీవు శ్రీమంతుల యింటి పెంపుడు చిలుకవై యుండి నీయీ గతచరిత్ర నాలకించినపుడు శాపవిముక్తి యగునని చెప్పె" నని పలుకుచుండ నాచిలుక ముమ్మారు స్వామి చుట్టు ప్రదక్షిణ చేయుచునె మానవాకృతి నొందినది. ప్రత్యక్షముగ నాదృశ్యమును గాంచిన రెడ్డిగారు స్వామికి ప్రణమిల్లెను.

# దక్షయజ్ఞ భూమి ద్రాక్షారామము




రాయవరం నుండి బయలు దేరిన స్వాములవారు ద్రాక్షారామం చేరిరి. ద్రాక్షారామం పురాణ ప్రసిద్ధి గన్న పుణ్యక్షేత్రం. ఇచట క్షేత్రపాలక స్వామి భీమేశ్వరుడు. కాశీ విశ్వనాథునిచే శాపగ్రస్తుడైన వ్యాసమునీంద్రుడీ భీమేశ్వరుని సేవించెను. ఆకాశ గంగను భూమి మీదికి తెచ్చిన అహల్యా గౌతము లిచట తపస్సు చేసిరి.

ప్రప్రథమంబుగ భువనపుత్ర విశ్వకర్మ యీ సమస్త భూమండలము నేలిన తరువాత కశ్యపుడు దక్షుడు మొదలైనవారు ప్రజాపతులైరి. దక్షప్రజాపతి పెద్ద కుమార్తె సతీదేవి. సతీదేవి శివుని భార్య. ఒకప్పుడు కైలాసమున తపోనిష్ఠ యందున్న శివుడు తన్ను పరామర్శింపలేదని కోపించిన దక్షుడు యజ్ఞము చేయుచు తిలకింప పార్వతీ పరమేశ్వరులను పిలువక పగబూనెను.

ఐనను సతీదేవి తండ్రి చేయుచున్న యజ్ఞం చూడవచ్చినది. దక్షుడామెను చూచి "పిలువని పేరంటమున కేల వచ్చితి?" వని పరిహసించి నందున దాక్షాయణి యోగాగ్నిలో భస్మమైన పుణ్యక్షేత్రం ద్రాక్షారామం.

# కాళరాత్రులలో కాళికా విహారము



అది సూర్యాస్తమయ సమయం. ద్రాక్షారామ మందొక యింటి యరుగు మీద విశ్వనాథాచార్యులు కూర్చుండియుండ పురప్రజ లాందోళనలతో తలుపులు మూసికొను చుండిరి.

ఆ యింటి యజమాని మాత్రం తలుపు తెరచి "అయ్యా! మీకు మా గ్రామ పరిస్థితి బొత్తుగా తెలియనట్లున్నది. ఆ ప్రక్క వీధిలో కాళికాలయ మున్నది. రాత్రివేళ లందా దేవీవిగ్రహం ప్రాణాలతో వీధుల వెంట తిరిగి తెల్లవారు సరికి మరల గుడికి చేరుట దినచర్య. సంచారము నందామె దృష్టి సోకిన మానవ మానవేతర జీవులకు మరణం తప్పదు. నీవీ రాత్రికి మా యింట నిద్రించి నీ నిండు ప్రాణముల నిలుపుకో"మ్మని పిలిచెను.

స్వాములవా రేమియు చలింపలేదు. "బాబూ! నేను నాయను వారెవరును లేని ఏకాకిని. నేనేమైనను నాకు చింతలేదు. మీరు క్షేమముగ నున్న చాలు" ననగ నాయింటి పెద్ద "సరె నీకర్మ. నీకీనాటితో నూరేండ్లు నిండినవి కాబోలు. నేనేమి చేయగలి?" ననుచు లోని కేగి గడి బిగించు కొనెను. ఆమాట లాలకించిన స్వాములవారు నవ్వుకొనిరి.

# భీజాక్షర యంత్ర భీభత్సము



నడిరేయి కాబోవుచున్నది. భద్రకాళి అపర మృత్యుదేవతావతారమున బయలుదేరినది. ఆమె కెదురైన రెండు గేదెలు రక్తం గ్రక్కి చనిపోయినవి. స్వామి దెసకు వచ్చుచున్న దేవి సరాసరి ముందుకురాక ఎందు వలననో గాని మరొక వీధిలోనికి మలుపుతిరిగి పోయినది.

అదను చూచి ఆలయం లోనికి ప్రవేశించిన స్వామి నిదానముగ నలుమూలలల తిరగిచూడ వాస్తుదోషం కనబడలేదు. మూల యంత్రంలోని బీజాక్షరములు స్థానముల తప్పినవి. స్వాములవారి స్వహస్తం తాకినంతనే యంత్రంమీద నున్న అక్షరము లదృశ్యము లైనవి. మరల యోగదండము తాకినంత మాత్రమున క్రమబద్ధ బీజాక్షర మంత్ర దర్శనమైనది. యంత్రము యథాస్థానమున నుంచి - దేవి గుడిలోనికి రావీలుపడని దిగ్బంధన చేసిన స్వాముల వారచటనే శయనించిరి.

తెలతెలవారు చుండ తిరిగి వచ్చిన అమ్మవారు లోపలకు పోలేక పోయి నందున వాకిలి ముందు నిలబడి వలవల యేడ్చినది. శక్తివంతమైన దేవత కిపుడు సంకటావస్థ సంభవించినది.

# బండరాయిగ మారిన భద్రకాళి



గడపదాటి లోపలకు పోజాలని కాళికాంబ స్వాములవారిని చూచి "యంత్ర బీజాక్షర దోషప్రభావమునకు గురియైన నా పాప మేమున్నదని నాకీ ప్రాయశ్చిత్త?" మనుచు ప్రశ్నించినది.

స్వాములవారా దేవతతో "తల్లీ! నీవు చెప్పినది నిజమేకాని, నిప్పును చూచి ముట్టినను చూడక ముట్టినను కాలకనుండదు. కారణ మేదైన నేమి నీ వలన లోకమున కపకారం జరిగినది. కర్మఫలము ననుభవింపక నేరికినైన తప్పదు. నీ కికమీద పూజలు జరుగవు. ముందు గోదావరీ నది పొంగినపుడు నీవు, నీ గుడియు ప్రవాహమున బడిపోవుదురు. అంతవరకు నీవిచట శిలవై పడియుండు" మని చెప్పచుండగనె తెలవారినది. భద్రకాళి బండగమారి మూగపోయినది. అమె యందున్న దుష్ట శక్తులన్నిటిని బంధించి స్వాముల వారు స్నానమునకు పోయిరి.

ఆపద్బాంధవుని వలె వచ్చి ఆదుకొనిన స్వాములవారి కందఱు సాగిల బడి మ్రొక్కిరి. పరిసర గ్రామాల కీవార్త ప్రాకి నందున స్వామిని దర్శింప వచ్చెడి ప్రజల కంతులేదు - అపు లేదు.

# గోదావరీ పుష్కర మాహాత్మ్యము



ద్రాక్షారామము నుండి రాజమహేంద్రవరం వచ్చిన అవధూతలవారు గోదావరీ తీర కోటిలింగాల రేవు యొద్ద నివసించిన పదేండ్లకు పుష్కరాలు వచ్చినవి. గోదావరీ పుష్కర స్నానమునకు రాజమహేంద్రం వచ్చిన రాజా పూసపాటి విజయరామ రాజేంద్రులు స్వామి వారిని దర్శించి "పుష్కరము లననేమిటి?" అని యడిగిరి.

గురుదేవు లంతట "రాజా! పుష్కరమనగ పన్నెండేండ్ల కాలమానం. నవగ్రహము లందలి గురువు తన పండ్రెండు మంది భార్యలతో గూడి సింహరాశిని ప్రవేశించి నపుడు గోదావరీ పుష్కర మనెదరు. అప్పడు ముక్కోటి దేవతలా జలము లందుండెదరు. కావున భక్తులైన వారు స్నానములు చేసి పవిత్రు లయ్యెదరు." అని చెప్పి ఒక పడవలో నదిలోని మధ్యభాగమునకు తీసికొని పోయి నల్లత్రాచు వలె పారుచున్న పాయను చూపగ ప్రభువు లందు స్నానం చేసిరి. తరువాత సంకల్పం చెప్పిన గురువు గారికి దక్షిణ లిచ్చి నమస్కరించిన రాజును రాజబంధువులను స్వాముల వారాశీర్వదించిరి.

# పరాభవ మొందిన ప్రభుత్వాధికారి



తహశీల్దార్గ ప్రభుత్వోద్యోగియై ఒక బ్రాహ్మణుడు రాజమండ్రికి వచ్చి రెండు నెలలైనది. ఆయన ముక్కోపి - దురహంకారి. వాని భార్య ఉత్తమురాలు. ఐనను అలిమాట నాలకింపడా దురహంకారి.

ఒకనాటి ఉదయమున స్వాములవారు ధవళేశ్వరం నుండి కోటి లింగాల రేవుకు వచ్చుచుండిరి. గుఱ్ఱమెక్కి కచేరికి పోవుచు ఎదురైన తహశీల్దార్ "నాకీ బైరాగి నమస్కరింపడే" మని చేతిబెత్తమెత్తి కొట్ట బోయెను. స్వాములవారాతని వంక తలెత్తి చూచినంతట ఎత్తినచేయి ఎత్తినట్లె కదలక నిలిచిపోయినది. అతడొక దిష్టిబొమ్మ మాదిరి నిలబడి యుండ నోటిమాటయు బయటకు రాదయ్యెను. ఎవరే మనుచున్నను బదులాడలేక అభిమానంతో కుమిలి కుమిలి పోవు చుండెను.

పతికి జరిగిన పరాభవం వినినంతనే వానిభార్య వచ్చి స్వాములవారి పాదాలంటి మగని అపరాధం మన్నింపు మని ప్రార్థించినది. విశ్వేశ్వరులవారు కరుణించి కమండలోదకం చల్లినంతనే అహంకారం హరించిన అధికారికి చలనశక్తి కలిగినది.

అధికార దుర్వినియోగ మనర్థదాయకం

# బాధలు పెట్టిన బ్రహ్మపిశాచి



రాజమండ్రిలో లక్ష్మీవారపుపేట. పరువు మర్యాదలు గల పండిత కుటుంబం. ఆయింటి యందొక అమ్మాయికి దయ్య మావేశించినది. ఆ దయ్య మాడినదాట - పాడినది పాట. భూతవైద్యులను సైతం బోకరించి "మింగేస్తా" నంటు మీది మీది కురుకుచున్నది.

ఒకనాటి సాయంత్ర మాదయ్యం పట్టిన యువతి వీథిలో నిలబడి వెకిలి నవ్వులు నవ్వుచుండ జనం గుంపు గూడిరి. అంతలోనె పిలిచినట్లు అటు వచ్చిన స్వాములవారు గ్రుడ్లురిమి చూచినంతనె గుటకలు ఖ్రింగుచు పెరటిలోనికి పరుగెత్తిన దయ్యం పిలిచినను రాక మొండిక వేసినది.

ఆమె తల్లిదండ్రులు వచ్చి "మహానుభావా! ఎక్కడెక్కడకో పోయి ఎవరెవరి చేతనో రాజవైద్యాలు భూతవైద్యాలు చేయించితిమి. తీర్థాలలో క్షేత్రాలలో త్రిప్పకొని వచ్చితిమి. పెద్దలకు పేరంటాండ్రకు మొక్కుకున్నను వదలని దయ్యం మిమ్ము చూచి దడిచిపోయినది. దైవాంశ మూర్తులు దయయుంచి మమ్ము కాపాడండి" అంటూ మరిమరి వేడు కొనగ స్వాములవారు సమ్మతించిరి.

# పీడ తొలగించిన ప్రియబంధువు



స్వాములవారా బ్రాహ్మణుల యింట ముగ్గులు వేయించి పీట మీద కూర్చుండి పిలిచినంతనే గాలి సోకిన అమ్మాయి గడగడలాడుచు వచ్చి కుదురుగ కూర్చున్నది. "ఎవరవు నీవు? ఎందుకు వచ్చితివో నిజం చెప్పకపోతే నిన్ను పాతివేస్తా" నని స్వాములవారనుచుండ దడచి పోయిన దయ్యం దారికి వచ్చి దాసోహ మన్నది.

భగవాన్! నేను శ్రీమంతులైన వైశ్యుల యింటి బిడ్డను. అత్తవారింకను మహైశ్వర్య వంతులు. పేదవారనిన నాకు పెద్ద చిరాకు. ఒకనాడు బిచ్చమడుగ వచ్చిన బైరాగిని నానా తిట్లు తిట్టితిని. ఆ మహనీయు డాగ్రహించి నన్ను "బ్రహ్మ పిశాచి వైపుట్టు" మని శపించెను. తిరిగి నేను ప్రార్థింపగ నన్నా సాధువు కరుణించి "ముందు రానున్న శంకరావతార మూర్తిని దర్శించినపుడు నీపిశాచి దశ తొలగు" నని సెలవిచ్చిరి. స్వామీ! ఆసమయ మిపుడు వచ్చినది. నాకా శాపం తీరిపోయిన" దని చెప్పి విడిచి పోయినందున నా బ్రాహ్మణ యువతి యథాస్థితి పొందినది. వారందఱును స్వాముల వారిచ్చిన తీర్థ ప్రసాదంబులు పుచ్చుకొనిరి.

# ఇంట బుట్టిన ఈగలసంతానము



రాజమండ్రి యందున్న విశ్వబ్రాహ్మణు లందొకనికి స్వామి యెడల భక్తి కలిగి నందున ప్రతిదినమును గురుదేవులు త్రాగుటకు పాలీయ వలయునని తన యింట నియమించెను. కాని ఆడవారి కది గిట్టలేదు. ఆయనంత మహాత్ముడనియు ననుకొనుటలేదు. ఒకనాడు నట్టింట వాలిన యీగలను చంపి పాలలో వేసి స్వాములవారికి త్రాగనిచ్చిన దాయింటి యిల్లాలు.

స్వాముల కాగ్రహం కలిగినది. పాలలోని యీగలను అరచేతిలోనికి తీసికొని "ఫూ" అని ఊదగనే చచ్చిన యీగలు నాలుగు బ్రతికి లేచిపోయినవి. "ఇక మీయింట నీయీగలే పుట్టనున్న" వని చెప్పి స్వాములవారు వెళ్లిపోయిరి. అప్పటినుండి వారికి ఈగతల వంటి తల - మిడిమిడి గ్రుడ్లు - లావు కడుపు. సన్నని కాలుసేతులు గల సంతతి కలుగ నారంభ మైనది.

గృహస్థులు విశ్వేశ్వరులను క్షమాపణ గోరి సేవించు చున్నందున తరువాత తరువాత సంతానంలో కొంత మార్పు వచ్చుచున్నది. 1950 వ సం॥ ప్రాంతమునందా యీగల సంతానమును చూచిన వారీ 1998 సం॥నందు మనకు చెప్పచుండిరి.

# రసయోగ మండలి రహస్యము



విశ్వనాథులవారు రాజమండ్రి చేరిన పన్నెండేండ్లకు స్థానిక విశ్వబ్రాహ్మణులలో సంచనల మేర్పడినది. సంఘు పెద్దలంద రొకనాడు స్వాముల వారిని సందర్శించి "మహానుభావా! మీ రిచటకు వచ్చినట్లు మేము నిన్న మొన్ననే వింటిమి. మహాభాగ్యం. మన వారి స్థితిగతులు మీకు తెలియనివి కావు. రసయోగ రహస్యం చెప్పి కులంవారి కుటుంబాల నిలపెట్టండి" అని అతి వినయ ముట్టపడ నడిగిరి.

స్వాములవారేమియు సాకు చెప్పక "బంధువులారా! రసయోగ రహస్యం చెప్పనేల? చేసి చూపెద. నవపాషాణములను రాగి అరివేణమును తీసికొనిరం"డని నంతనే కొందఱు లేచి పరుగున బోయి చెప్పిన వానిని తెచ్చియిచ్చిరి. అందఱు చూచుచుండ నాచార్యులవారా పాషాణములను పటికి బెల్ల మట్లు నమిలిమ్రింగి ప్రక్కకు తిరిగి అరివేణము మీద మూత్ర విసర్జన చేయగ రాగిపళ్లెం మేలిమి బంగారమైనది. "చూచితిరి కద! ఇకనేమి? మీరును ఇట్లే బంగారమును చేసికొనవచ్చు" ననగ వచ్చినవారి మొగము లన్నివాడి పోయినవి - వాలి పోయినవి.

# పట్టుకున్నది పసిడిమూట



కృష్ణాజిల్లా పెయ్యేరు గ్రామమున వేముల సూర్యనారాయణ స్వర్ణ శిల్పి. భార్య సుబ్బమ్మ. ఏకైక కుమార్తె రాజ కోటేశ్వరమ్మ డోకిపఱ్ఱులో ముంతావారి కోడలు. భర్త మరణించి నందున సూర్యనారాయణగారు తన కుమార్తెను, రెండేండ్ల మనుమడైన. వరప్రసాదరావును గూడ తెచ్చి తన యింట నుంచుకొనెను. రాజకోటేశ్వరమ్మ గారాబాల బిడ్డ యైనందున ఇంటి పను లామెకు చెప్పరు - ఆమె చేయదు.

1936 వ సం॥ ప్రాంతమున పెయ్యేరు వచ్చిన స్వాముల వారిని సూర్యనారాయణ తమయింట నివసింప చేసిరి. 15 దినములు గడచినవి. ఆకాలమున ప్రతిదినం వడ్లుదంచి బియ్యంచేసి వంట చేయుదురు. ఒకనాడు సుబ్బమ్మ "ఇంటిలోని వారికి చేయలేకనే నడ్డి విరిగి చస్తుంటె బాటనపోయే బయట వారిని గూడ తెచ్చి నెత్తి కెక్కించితి" వని మగనిని విసిగికొన్నది.

ఆ మాటలు వీధిలోనుండి వచ్చిన స్వాములవారు వినినందున దుకాణములోనికి వచ్చి వారే పావులా ఎత్తు రాగిని కరిగి మేలిమి పూజ చేసి యీయగ సూర్యనారాయణ గారానందించి యింటిలోనికి పోయి భార్యకు చూపి వచ్చినంతలో అచ్చట స్వాములవారు లేరు - ఇక కనపడలేదు.

# నిరుపేదరాలికి నిక్షేపప్రాప్తి



స్వాములవారు విజయవాడలో ఒక నిరుపేదరాలింటికి పోయి "అమ్మా! నేనున్నన్ని నాళ్లు నిత్యావసర వస్తువులు తెచ్చి యిచ్చుచుందును. నీవు వండి పెట్టితే నీపొట్టయు నిండగలదని చెప్పిరి. ఆమె అందు కంగీకరించినది. స్వాములవారికి స్వయంపాకం ప్రతిదినం భక్తాదులు తెచ్చి యిచ్చుచుండిరి. పది పదునైదు దినములు గడచిపోయినవి.

ఆచార్యులవారు విజయవాడ నుండి వెళ్లు నపుడు "అమ్మా! నీవిక నుండి తిండిగింజలకు తిరిపమెత్త వలదు. నీవు వంట చేయుచున్న పొయ్యి క్రింది నేల త్రవ్వి మరలపూడ్చి పైచి అచటనే వంట చేసుకొను" మని చెప్పి వెళ్లిరి. ఆమె పొయ్యి క్రింద త్రవ్విచూడగ బంగారపు మొహరీల ముంత దొరకినది. నిరుపేదరాలికి నిక్షేపం సిద్ధించినది. ఆ ధనంతో బ్రతికినంత కాలమామె హాయిగ జీవించుచు "శ్రీ విశ్వనాథస్వాముల వారు పెట్టిన భిక్ష" అని వేళకు యింటికి వచ్చిన అతిథి అభ్యాగతుల కన్నం పెట్టినది. చేచాచిన వారికి లేదనకుండ దానధర్మాలు చేసినది. చివరకామె శాశ్వతముగ శివసాయుజ్యము చెందినది.

# ఫక్వాహార పరిత్యాగదీక్ష



ఆకాలమున విజయవాడలో సత్యదీక్షితులను విశ్వబ్రాహ్మణ పండితుడుండెను. మిడిమిడి జ్ఞానం మిడిసిపాటు లతని స్వంతములు. విశ్వనాథంగారు మద్యమాంసములు మంచివికావు అనినందున విమర్శింపబూనెను. స్వాముల వారిని అవమానించు తలంపున మంచిగ నటించుచు తనయింట భోజనము చేయ పిలిచెను.

సత్య దీక్షితులు తనభార్యను పిలిచి "దుర్గా! మనయింటి కతిథిగ వచ్చినపుడా డాంబికాచార స్వామికి భోజనమున మాంసము పెట్టు" మని కఠినముగ శాసించెను. ఆమె కది యిష్టం లేదు. ఇరువురు సహపంక్తి భోజనములకు కూర్చున్నపు డేమి చేయవలనో తెలియక మదనపడుచున్న స్థితి గ్రహించిన స్వాములవారు "అమ్మాయీ! నేను అపక్వాహారదీక్ష యందున్న విషయం నీకు తెలియదా? వండిన పదార్థముల వడ్డింపవల" దని, లేచి ఫలముల దిని పాలు త్రాగి - భక్తురాలినా విషమ పరీక్ష నుండి యుక్తి మార్గమున కాపాడిరి.

సత్యదీక్షితుల ప్రయత్నం ఫలింపలేదు
దుర్గకు స్వామి అనుగ్రహం సిద్ధించినది.

# మనోగమనం గల మహాత్ములు



తెనాలి తాలూకా ఇంటూరు గ్రామంబున నున్న కొణిదెపు రామలింగం గారు శివభక్తులు. ఆయన పెద్దకొడుకు పేరయ్య. విశ్వనాథావధూతలవారు ఇంటూరు వచ్చినపుడు పేరయ్య స్వాములవారిని విడువక నీడలాగ వెన్నంటి యుండెను.

ఆచార్యుల వారొకనాటి రాత్రి మద్రాసు పోవలసి వచ్చినది. మహాత్ములకు మనసే వాహనం. స్వాములవారు నిద్రించుచున్న పేరయ్యను గూడ సంకల్ప మాత్రమున తమవెంట మద్రాసు తీసికొని పోయిరి. అక్కడ మేల్కాంచిన పేరయ్య బెంగగొనె నని గ్రహించి నందున స్వాములవారు "రేపు నీవు నీయింటి కడ నుందువు. దిగులు పడకు" మని చెప్పిరి. చెప్పినట్లె నాటి రేయి మద్రాసులో పరుండిన పేరయ్య తెల్లవారు సరికి ఇంటూరులోని తన ప్రక్కమీద నుండెను.

పేరయ్య తనవారి కపుడు "నేనే బండి నెక్కలేదు. ఇంటూరు నుండి మద్రాసునకు మద్రాసు నుండి ఇంటూరునకు నన్ను ప్రక్క మీదనే ప్రయాణం చేయించిన రథసారథి విశ్వనాథాచార్య స్వాముల వా"రని చెప్పెను.

# రైలుబండి కదలని రహస్యము



విజయవాడ నుండి ఒంగోలు పోవు రైలు మార్గం ప్రక్క కాలి బాటన స్వాములవారొకప్పుడు నడచుచుండిరి. వెనుక నుండి వచ్చిన మెయిలు ఇంజను ప్రోత్తకు స్వాములవారి ఆలోచన కంతరాయం కలిగినందున తలెత్తి చూచి నంతనె పరుగెత్తుచున్న పొగబండి నిలచి పోయినది. ఇంజను లోపమేత్రము మాత్రం కనబడలేదు - బండి కదలుట లేదు.

ఆ బండి నడపుచున్న డ్రైవరు యోచన గల బుద్ధిమంతుడు. బండి దిగి వచ్చి "తమ రెవరు స్వామీ?" అని యడుగ స్వాములవారు "నేనేవరినైతేనేం? నీబండి నిరాటంకంగ నడచును పో" మ్మనిరి. డ్రైవరు తిరిగి బండి నెక్కుచుండగనె రైలు తనంతటతానె కదలిపోయినది. ఆ డ్రైవరు దైవచింతన గలవాడైనందున స్వాముల వారిని తిరిగి దర్శింప వలయునని ఎంత ప్రయత్నించినను ప్రయోజనం లేక పోయినది. "అంత మహిమ గల్గిన ప్రత్యక్షదైవ స్వరూపుని సమీపించితిని - సంభాషించితినె కాని; నమస్కరింపనైతిని - దీవింపబడనైతినే" అని పరితపించు చుండ స్వాముల వారాయనకు స్వప్నసాక్షాత్కారము ప్రసాదించిరి. డ్రైవరు చెందిన తపన తపస్సుగ పరిణమించినందున దైవ సాక్షాత్కారమైనది.

# మతిభ్రష్టుడైన మదోన్మాది



పొన్నూరు గ్రామమందున్న ఒక విశ్వబ్రాహ్మణుడు పురాణేతిహాసముల చదివిన పండితుడు. విశ్వనాథాచార్యుల వారు పొన్నూరు విచ్చేసినపుడు ఎదురేగి నమస్కరించి తనయింటికి తోడ్కొని పోయి సకలోపచారములు చేసెను. స్వాములవారు భోజనానంతరం శయనించి లేచిన పిదప నిరువురు సత్సంగమమున పాల్గొనిరి.

అంతలో పొరుగింటి పెద్దమనిషి వచ్చి పలుమార పని కల్పించుకొని "ఎవరీయన? ఎందుకు వచ్చెను? ఏమి తెలియు నితనికి?" అని సభ్యత లేని ప్రసంగం చేయుచుండ గృహస్థునకు చిరాకు కలిగి స్వామివారి వంక చూచెను. స్వాముల వారు "ఆః పిచ్చివాడులె" మ్మనిరి. ఆమాట లాడుచున్న వానికదే ధోరణి పిచ్చిగ మారినది. ఆలుబిడ్డలు - ఐనవారు దగ్గఱకు చేరనీయక తరిమి గొట్టిరి. వీధుల వెంట తిరుగుచు - ఎంగిలాకుల నేరి నాకుచు - చెత్తకుప్పలలో పొరలాడుచు పడరాని పాట్లు పడి చివరకు దిక్కుమాలిన చావు చచ్చెను. పాపాత్మునికి తగ్గ ప్రాయశ్చిత్తమైనదన్నవారే కాని అయ్యో పాపమన్నవారు ఒక్కరును లేరు.

# నడచి వచ్చిన నాగాభరణుడు



స్వాములవారు పర్యటనలో కందుకూరు పోయిరి. కందుకూరున జనార్ధన స్వామి ప్రసిద్ధి. ఒక స్థానిక విశ్వబ్రాహ్మణ కుమారుని విషజ్వరమెన్నినాళ్ళకును తగ్గలేదు. "తగ్గినట్లయితే కొడుకు చేతనే మల్లేశ్వరస్వామి కభిషేకం చేయిస్తా" నని తండ్రి మొక్కుకున్నాడు. మూడవ నాటికి జ్వరం పూర్తిగ విడిచి పోయినది.

మల్లేశ్వరాలయ పూజారులు "మీరు తాకితే దేవునికి మైల కనుక లోపలకు రారా" దని అటకాయించిరి. ఎవరేం చెప్పినా ఎంత చెప్పినా వారు పట్టిన పట్టు విడువలేదు. విశ్వనాథం గారంతట "మల్లేశ్వరా! మా చిరంజీవి స్వహస్తములతో నిన్నభిషేకింప వచ్చెను. ఒకసారి నీవా లోపల నుండి వెలుపలకు రావయ్యా!" అని పిలిచి నంతనే లోపలనున్న శివలింగం పానుమట్టంతో సహా చరచర బయటకు వచ్చినది. అది చూచి భయభ్రాంతులైన పూజారులు స్వాముల వారిని క్షమాపణ వేడుకొనిరి. అభిషేకానంతరం ఆచార్యులవా "రికపో" మ్మని నంతనే శివలింగం తిరిగి గర్భాలయంలోనికి పోయి యథాస్థానమున నిల్చినది.

# ఆకలిగొన్న జీవు లతిథులు



నెల్లూరు నగరమున హైమవతీ సర్వేశ్వరు లనెడి రెడ్డి దంపతు లుండిరి. వారు సదాచార సంపన్నులు. ఒకనాడు వీధిలో నడచిపోవు చున్న విశ్వనాథులను చూచి నమస్కరించి ఇంటిలోనికి భక్తిశ్రద్ధలతో గొనిపోయి తియ్య తియ్యని పండ్లు తిన సమర్పించిరి.

స్వాములవారు క్షణకాలం నిదానించి లేచినందున ఆపుణ్య దంపతులు "భగవాన్! ఫలముల నారగింపకనె పయనించుచుంటిరే?" మని అడిగిరి. యతీంద్రులు "బిడ్డలారా! మీ లోప మేమియును లేదు. అటు చూచితిరా! ఆపండు మీద నున్న చీమ రసాస్వాదము చేయుచున్నది. దాని నావలకు ద్రోచి దాని నోటి దగ్గతి ఆహారము నేననుభవింప గలనా? అతిథు లనగ మానవులేకాదు - ఆకలియై వచ్చిన ప్రతిజీవియు అతిథియే. మూగ జంతువులు నోరు తెరచి అడుగలేవు. భూతదయ పంచయజ్ఞము లందొకటి. మీరిది మరువ వల"దని చెప్పెను. జ్ఞానము గల్గిన గృహస్థులు స్వాములవారికి క్షీరము లిచ్చి దీవెనలు పొందిరి. విశ్వనాథాచార్యుల వారి మాట వారికి వేదవాక్య మయ్యెను.

# మహిళకు మాంగల్యభిక్ష



అమ్మాయీ! హైమవతి! నీ పెనిమిటికి అకాల మృత్యువు సమీపమున నున్నది. నన్ను నమ్మినవారిని కాపాడుట నాధర్మము. నేటి సాయంత్రం నీపెనిమిటికి చలిజ్వరం రాగలదు. నీవీ దినమంతయు నుపవాస ముండి "ఓం మృత్యుంజయాయ నమ:" అను మంత్రమును భక్తితో జపింపుము. దీర్ఘ సుమంగళి వయ్యెద" వని చెప్పి విశ్వనాథాచార్యులు వెళ్లిపోయిరి.

మహాత్ములు చెప్పినట్లె రెడ్డిగారికి జ్వరం వచ్చినది. నడిరేయి దాటినది. ప్రత్యక్షమైన మృత్యుదేవత ప్రక్కకొదిగి నిలుచున్నది. స్వామి ప్రసాదించిన వరబలంబున మృత్యువును చూడగలిగిన హైమవతి పార్వతీ దేవిని ప్రార్థింప వీర విజయదుర్గ సాక్షాత్కరించి అభయహస్తం చూపినది. కబళింప వచ్చిన మృత్యువు కంపమొంది కాళికాదేవికి కరములు మోడ్చి హైమవతిని "సుమంగళీభవ" అని దీవించి వెనుకకు తిరిగి పోయినది రెడ్డిగారికి ప్రాణగండం తప్పినది. ఆరెడ్డిదంపతులప్పటి నుండి విశ్వనాథాచార్యులను విశ్వాసముతో నారాధించుచుండిరి. బంధువులందఱును వారి యదృష్టమును కొనియాడిరి. హైమవతి ఆదర్శ మహిళగ గుర్తింపబడినది.

# పాషాణము చేసిన ప్రణామము



అక్కడక్కడ తిరుగాడుచు చంద్రగిరి చేరిన స్వాములవారొక నీటిమడుగున దిగి కాలుసేతులు కడుగుకొను చుండ "పరమేశ్వరా! ప్రణామం" అను మాటలు స్పష్టముగ వినబడినవి. "మాటలు వినిపించుచు మనిషి కనుపించడేమి?" అని యోగీంద్రులు యోచించుచుండిరి.

భగవాన్! నన్ను చంద్రగిరిరాజు నందురు. నాభార్య గర్భవతియై యుండ వ్యాపారమునకు ద్వీపాంతరముల కేగిన నేను పదునెన్మిదేండ్లకు తిరిగి వచ్చితిని. నాభార్య యందుదయించిన పుత్రిక అప్పటికి నవయౌవనవతి యైయున్నది. కన్నబిడ్డని తెలియక కామించితిని. నన్నామె పాషాణమువై పడియుండుమని శపించినది. నేనది తెలిసి చేసిన నేరము కానందున తిరిగి ఆమెయే " నాన్నా! శ్రీవిశ్వనాథాచార్యస్వామి పాదస్పర్శయైనపుడు నీకు మాటలాడు శక్తియు, శ్రీవీరబ్రహ్మేంద్ర స్వాములవారు వీరభోగవసంత రాయావతారమున వచ్చినపుడు నీకు శాపవిముక్తియు నగునని" చెప్పినది. మీపాద స్పర్శచే మాటలాడ గల్గిన నేడు సుదిన మనగ స్వాముల వారు "నీకు శుభమగుగాక" అని దీవించిరి.

# ముద్రణాలయాధిపతి మొదలియార్



అప్పుడప్పుడే మన భారతదేశమునకు ముద్రాక్షర యంత్రములు దిగుమతులగుచున్నవి. చెన్నపురి యందున్న రెండు ముద్రణాలయములలో మొదలియార్ వారి సంస్థ మొదటిది. ఆయనగారు చేసిన పుణ్యకార్యముల కంతు లేదు. ఏనాటి పాపమొ ఎఱుగముకాని పన్నెండేండ్ల నుండి ప్రబలమైన కుష్ఠు వ్యాధి కొంచెమైనను తగ్గలేదు.

మదరాసులో మజిలీ చేసిన స్వాములవారు మొదలియార్‌ను కలిసికొని వారిచే రచింపబడిన "శ్రీసనారీ విశ్వేశ్వర సంవాద" మను వేదాంత గ్రంథమును ముద్రణ చేయింప కోరినందున మొదలియార్ "వ్యాధి గ్రస్థుడనైన నేను చేయలే" ననెను. స్వాములవారు తిరిగి "నీవు చేయగలవు. నీకాయురారోగ్యముల నిచ్చుటకే నేను వచ్చితి" ననిరి. మొదలియార్ మొదటి మనసు మారి గ్రంథ ముద్రణ కొక వారం గడువు చెప్పెను. స్వాములవారు సంతసించి వ్రాత పుస్తకము మొదలియార్ వారి చేతి కిచ్చుచు "అశ్రద్ధ చేయవ"ద్దని చెప్పి వెళ్లిరి. మొదలియార్ ముద్రణాలయమున నున్న పనివారిని పిలిచి ఎన్ని పనులున్నను మీరీ గ్రంథమును శీఘ్రముగ ముద్రింపవలెయునని నియమించెను. ముద్రణ ప్రారంభమైనది.

# అచ్చు తప్పులు - మచ్చ గుర్తులు



వారం దినములు గడచినవి - గ్రంథ ముద్రణ పూర్తియైనది. రమ్మనమన్న రోజున విశ్వనాథంగారు వెళ్లిరి. మొదలియార్ ఎదురేగి పాదాభివందనం చేసి పరామర్శించిన పిదప "స్వామీ! తమ గ్రంథం ముద్రింప బడినది. ఇదుగో స్వీకరించండి" అంటూ పూలలో బెట్టి చేతి కందీయగ మహాయోగీంద్రులు మందహాసం చేసిరి.

"భగవాన్! రాత్రి నాకలలో తమ కమండలోదకంబున తలమీద స్నానం చేసితిని. తెల్లవారినది మెలకువ వచ్చినది. కుష్టు వ్యాధితో కుళ్లిపోయిన నా శరీరం మళ్లీ మామూలు రూపం పొందినది. కాని అచ్చటచ్చట మూడు మచ్చలు మాయలే" దని మొదలియార్ విన్నవించెను. స్వాములవారు సౌమ్యముగ "నీవు చేయించిన ముద్రణలో మూడు తప్పలున్నవి చూడుమని పుటలు విప్పిచూపగా మొదలియార్ ఆశ్చర్యం చెందెను. తొలి ముద్రణలోని తప్పలను మలి ముద్రణలో సవరించినంత వారి మొండి వ్యాధి మొదలంట పోయినది.

# జగద్గురువుల జగడము



ఇంటికి వచ్చినవాడు ఈశ్వరుడే నన్న నమ్మకం మొదలియార్‌కు కలిగినది. స్వాముల వారికి స్వాగతం పలికి బ్రహ్మరథంబున బాజా భజంత్రీలతో పురవీధు లందూరేగింప పురమాయించెను.

జగద్గురు శంకరాచార్య మఠాధిపతు లంతకుముందే జరిగిన రెండు నెలల క్రితం వచ్చి నుగంబాకంలో హిందూమతోద్ధరణోపన్యాసము లిచ్చిన సందర్భమున శిష్యు లాయనకు బ్రహ్మరథం పట్టి బజారుల వెంట నూరేగింప బయలుదేరిరి. కొంత సేపటికి హైకోర్టు యొద్ద యిరు పక్షముల వారెదురైరి.

వాద ప్రతివాదన లైనవి. "మీ రెడమ ప్రక్కగ తొలగిపొండి" అంటె మీరెడమ ప్రక్కగ తొలగిపొండి" అనడం - జగద్గురు స్థానం మాదంటె మాదని జగడ మాడడములైన తరువాత కొట్లాటకు సిద్ధమై కోరమీసాల దువ్వడం చూచి మందలింప వచ్చిన మధ్యవర్తులు "పండిత సభ పెట్టండి" అని పరిస్థితిని పరిధి దాటనీయ లేదు. ఊరిపెద్దల తీర్పు నుభయ పక్షముల వారామోదించి ఉత్సవాల నాపివేసిరి.

ఒకరినిమించిన వారింకొకరు - ఉద్దండ పండితుల మహోపన్యాసములాలకింప సామాన్య పండితులు సంసిద్ధ మగుచుండిరి.

# పండితసభలో ప్రశ్నోత్తరములు



పండిత సభ ప్రారంభమైనది. శంకరాచార్య పీఠాధిపతులు స్వాముల వారిని సంభోదించి "నీవెట్లు జగద్గురుడ వైతి?" వని నిలదీసి అడిగిరి - అతిశయం చూపిరి.

ఆచార్యుల వారాగ్రహింపక "నాయనలారా! ప్రణవం పరమేశ్వర సత్యనామం. హరిహర బ్రహ్మలన్నను, గాయత్రి యన్నను, విశ్వకర్మ యన్నను, విరాట్పురుషుని యొక్క పర్యాయ పదములు. ఇక పరమేశ్వర ప్రేరణచే అధర్వణవేదము నాలకించిన అంగిరసఋషి సంతతివాడు భువన పుత్ర విశ్వకర్మ. ఆయన ప్రపంచ ప్రగతికి మౌలికములైన పంచశిల్పముల సృష్టికర్త. ప్రప్రథమ ప్రజాపాలకుడాయనయే. అపుడందఱును భౌన విశ్వకర్మ వంశమువారే. దేవాచార్యుడైన బృహస్పతి, దేవపురోహితుడైన విశ్వరూపాచార్యుడు శ్రీరామచంద్రాదులకు విద్య నేర్పిన సుధన్వుడు; కశ్యపుడు మున్నగు వారందఱు విశ్వకర్మలైనందున నేనా జగద్గురు పరంపరలోని వాడను. షేషిణీ హనుమంత బిరుదాంకితుడను. నేనే కైలాస పతియైన శంకరుడ" నని నిర్భయంబుగ చెప్పెను.

# సనారీ విశ్వేశ్వర సంవాదము




శంకరాచార్య పీఠాధిపతులు శాస్త్రవాదం చేయజాలక మరొక దారికి మలుపు తిరిగి "నేనే కైలాసపతి నంటివి. ఆయన సాంబశివుడు అనగ అంబతోకూడి యున్న కల్యాణ ప్రదుడని అర్థం. మరి నీవు నీ పార్వతిని చూపు" మని నిదర్శన మడిగిరి.

స్వాముల వారందులకు సమాధాన పడి "పార్వతీ. ఇలారా!" అని పిలిచి నంతనే ప్రజా సమూహము నందున్న పదేండ్ల బాలిక దారి చేసికొని దగ్గరకు వచ్చి నటరాజుకు నమస్కరించి తొడమీద కూర్చున్నది. అంతట వారిద్దరు జరిపిన వేదాంత ప్రసంగం విద్వాంసులకు విభ్రాంతిని కలిగించినది. శ్రీవారి సెలవు పొంది తొడనుండి దిగిన పిదప ఎవరేమడిగినను నాకేమీ తెలియదని నగ్న సత్యం చెప్పిన పుణ్యవతి యొక వైశ్య బాలిక.

ఆ సంభాషణే "శ్రీసనారీ విశ్వేశ్వర సంవాద" మను పేర ప్రసిద్ధి గాంచిన వేదాంత గ్రంథము. త్రికాల వేదులైన స్వాములవారీ సంవాదము నంతయు ముందుగనే ముద్రణ చేయించిరి.

# ఫాలనేత్రం చూపిన పరమశివుడు



సనారీశ్వరుల వారి ప్రతిభ స్వయముగ చూచియు మనసు మారని మంద బుద్ధులు "నీవు చేసినది నటనగాని నిజంకాదు. నొసట కన్నులేని నిన్ను నటలాక్షుడను టెట్టు" లని విమర్శించిరి.

స్వాములవారు సహనం బూని "నాయనలారా! నిజముగ నేనిపుడు నా మూడవకన్ను చూపిన ముప్పు రాగలదు. నేడువలదు - రేపు కలదు. మీరందఱు సముద్ర తీరమునకు రండి. పదిబండ్ల పచ్చగడ్డి కుప్ప వేయించండి. నా ఫాలనేత్రం పదిమంది చూడవచ్చు ననిరి. అనుకున్నట్లు మరునాడందరు సముద్ర తీరమునకు వచ్చిరి. అనతి దూరమున నున్న స్వాములవారా గడ్డికుప్ప వంక చూడగనే వారి నొసటి నుండి బయల్పడిన నిప్పరవ్వ క్రమముగ పెద్ద దగుచు పోయి తాకినంతనే పచ్చగడ్డి భగ్గున మండి మసియైపోయినది.

పరీక్షింప వచ్చిన వారందఱు స్వామి పాదముల మీద పడి "పాహిమాం - పాహిమాం" అనినందున స్వాములవారందరిని సాదరమున మన్నించిరి. సనారి విశ్వేశ్వర స్వామి మహిమలు మహీతలమున ప్రాకినవి.

# సనారీశ్వరులిచ్చిన సందేశము




శ్రీ సనారీశ్వర స్వాములవారి పేరు ప్రతిష్ఠలు పల్లెలకు పట్టణములకును ప్రాకినవి. దేవతామూర్తి దీవెనలు పొందగోరి నేల యీనినట్లు నిత్యం వచ్చిపోయెడి వారికి విసుగు విరామం లేకపోయినది.

విశ్వేశ్వరుల వారొక విశ్రాంతి వేళ అనుయాయులతో "అయ్యలారా! నేనీ భూమి మీదకు వచ్చిన పనులన్ని నెరవేరినవి. కొంతకాలం నేనఖండ తపోదీక్ష యందుండ వలయును గాన శ్రీఘ్రముగ శ్రీశైలమున కేగుచుంటిని. నేనుపదేశించిన నిగమ ధర్మములను మీ రెన్నడును మరువవలదు. విశ్వకర్మ పరమేశ్వరుని విజ్ఞానమునకు ప్రతిరూపం వేదం. ధర్మక్షేత్రమునకు వేదములు దారి చూపగలవు. మంచి చెడ్డలు చేయుటకు మనిషి స్వతంత్రుడు - మనిషి చేసిన పాపపుణ్యముల ఫలితముల నీయ భగవానుడు సర్వాధికారి. ఆయనకు మొగమాట ముండదు - లంచం ముట్టడు. న్యాయం తప్పడు. దయామయుడైన దైవమును మరువకండి - పామరత్వమున పతనం కాకండి" అని చెప్పి పయనమైరి. స్వాములవారి ఎడబాటు సహింపలేక చింతించుచున్న భక్తులతో శ్రీవారు "నాయనలారా! ఇకముందు నేను మీ కంటికి కనపడనని విచారింపవలదు. నేనెల్లప్పడు నా భక్తుల హృదయములందే యుండెద"నని చెప్పి సాగిపోయిరి.

# వీరబ్రహ్మంగారి జీవ సమాధి దర్శనం




తపోనిష్ఠ వహింప మదరాసు నుండి బయలుదేరిన శ్రీసింహాద్రి విశ్వనాథావధూత స్వాముల వారు క్రమముగ రేణిగుంట, సూళ్లూరుపేట, కడప, మైదుకూరుల మీదుగ పర్యటించి కొలది దినములలో కంది మల్లాయపల్లె యందున్న వీరబ్రహ్మేంద్రస్వాముల వారి జీవసమాధిని దర్శింప బోయిరి.

క్రీ.శ. 1932 సం॥ నుండి 1969వ సం॥ వరకు మఠాధిపతులై యున్న శ్రీ శ్రీనివాస స్వాముల వారు సనారివారి కెదురేగి స్వాగతం పలికి సకలోపచారములతో గౌరవించిరి. అనంతరమున శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి జీవిత విశేషములను గురించి; ఇతర వేదాంత రహస్యములను గురించియు శ్రీసనారీశ్వరులు-శ్రీనివాస స్వాములు ప్రసంగించిరి. అవధూతలవారా మఠము నందున్న వారందఱకు తీర్థప్రసాదముల నిచ్చిరి.

అటుపిమ్మట వీరబ్రహ్మేంద్రస్వామి వారి జీవ సమాధికి నమస్కరించి అచటనుండి వెళ్లి శ్రీ శైలమున తపోనిష్ట వహించిన శ్రీ సనారీశ్వరస్వాముల వారీనాటికిని శ్రీశైల గుహాంతర్భాగము నందఖండ తపస్సమాధి యందుండిరి.

# కాల నిర్ణయము

శ్రీ సనారి వారి కాల నిర్ణయమొక గమనీయాంశము

శ్రీ సింహాద్రి విశ్వనాథావధూత స్వాముల వారి సంపూర్ణ జీవిత చరిత్ర విశేషశ్రమ చేసి వివిధాధారములతో వ్రాసిన కీ॥శే॥ కట్టి అచ్చుతరామారావుగారు వారి గ్రంథమున స్వాముల వారి జననం క్రీ॥శ॥ 1794వ సంవత్సరమని చెప్పి యుండిరి. అట్లే చారిత్రక పరిశోధకులు శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి జననం క్రీ॥శ॥ 1608వ సంవత్సర మనియు; సమాధి 1693 సం॥ అని ధృవపరచిరి. పై ఆధారములను బట్టి బ్రహ్మంగారు జన్మించిన పిదప సనారివారు 186 సం॥లకు బ్రహ్మంగారి సమాధి తరువాత 101 సం॥లకు జన్మించినట్లు నిర్ణయింపవచ్చును. అనగ క్రీ॥శ॥ 2000 సం॥ల నాటికి సనారి వారు జన్మించి 206 సం॥లగుచున్నది.

ఇక- మచిలీపట్నం (బందరు) విశ్వబ్రాహ్మణ కాలనీ యందున్న బ్రహ్మశ్రీ ముంతా వరప్రసాదరావుగారితో నాకు ది. 20-10-1997న పరిచయం కల్గినది. గుంటూరు జిల్లా పెయ్యేరు గ్రామమున నున్న శ్రీ వేముల సూర్యనారాయణ గారీ వరప్రసాదరావుగారికి మాతామహులు. ది. 27-9-1934న జన్మించిన వరప్రసాదరావుగారు కారణాంతరమున వారి రెండేండ్ల ప్రాయమున అనగ 1936వ సంవత్సరమున తల్లితో గూడ తాతగారింట నుండిరి. ఆ సమయంబున పెయ్యేరు వచ్చిన సనారీవారు వారి తాత వేముల సూర్యనారాయణ గారింట నున్నట్లేగాక మరికొన్ని స్వానుభవములను గూడ చెప్పినందున నీ సంఘటన క్రీ॥శ॥ 2000 సం॥ల నాటికి 64 సం॥ ముందు జరిగినది.

పాలకొండ అన్నవర మందలి రామలింగేశ్వరాలయమున 1850 సం॥ర ప్రాంతమున సనారీవారే లింగ ప్రతిష్ఠ చేసినట్లు జనవాక్యం వినబడుచున్నది. తెనాలి వాస్తవ్యులు బ్రహ్మశ్రీ దేవు లక్ష్మీనారాయణగారు మరికొందరు బంధువులతో గూడి మాతా అన్నపూర్ణా దేవి వారి సమాధినారాధింప 1950వ సం॥న ప్రాంతమున పాలకొండ పోయి వచ్చిన పిదపనే శ్రీ సనారీశ్వర దేవాలయ నిర్మాణం జరిగినదని చెప్పచుండిరి. నేటి 2000 సం॥ నాటికి 60 ఏండ్ల క్రితం స్వాముల వారిని చూచిన వారక్కడక్కడ నున్నట్లు చెప్పవచ్చును.

ఇందును గురించి యింకను విస్తృతముగ విచారింప దగియున్నది.

రచయిత- 'నాగశ్రీ'

# శ్రీ శైల గుహాలో చిద్రూప దర్శనము

శ్రీ శైలము చాల పురాతన ప్రసిద్ధ శివ క్షేత్రము. ఇది కూడలి యందున్న కారణమున దేశమునందలి అన్ని ప్రాంతముల వారికిని ప్రముఖ యాత్రాస్థలం. ఇచ్చటి గుహలలో యిప్పటికిని మహాఋషులు తపస్సు చేయుచుండిరను ప్రగాఢ విశ్వాస మెందరి హృదయములందో చెదరక నున్నది. ఆ కారణముననే శ్రీ శైల యాత్రికు లచటి గుహలను దర్శింప వేడుక పడుచుండిరి.

బహుశా 1995 సంవత్సర ప్రాంతమున శ్రీ శైల పర్వత కొండలు గుహలు చూచుటకు కొందరు టూరిస్టులు చాలా లోపలకు వెళ్లి గుహలు కొండలు మొదలగు సుందర దృశ్యములను తమ కెమెరాలలో బంధించుచున్న సమయంలో ఒక గుహలో చిన్న కాంతిపుంజము వెలుగుచుండెను. అది గమనించిన ఒక ఫోటోగ్రాఫర్ ఆ దివ్య కాంతిని తమ కెమెరాలో బంధించి ఫోటో ముద్రించగా ఒక మునీశ్వరుడు తపోనిష్టలో ఉన్నటుల కనబడినది. (ప్రక్కపేజీలో ఉన్న ఫోటో) శ్రీ స్వామివారి పాత ఫోటోలతో పోల్చి చూడగా స్వామివారి పోలికలు పూర్తిగా కలిసియున్నందున సదరు ఫోటో శ్రీ సనారీ విశ్వనాథావధూత స్వామిగా నిర్ణయించిరి. తపస్సమాధి యందున్న మహామునుల సందర్శనం మానవులకు సాధ్యపడదు. ఈనాటికి ఈ రూపమున పరమేశ్వరావతార మూర్తులైన శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామివారి తపోనిష్ఠా స్వరూపం లభించుట మన అదృష్టం.

స్వాముల వారి జన్మస్థలమైన పాలకొండ యందేగాక ప్రస్తుతమున విజయవాడ గుంటూరు తెనాలి మొదలైన పట్టణములందీ ఛాయ పటమున దర్శనమిచ్చుచున్న శ్రీ సింహాద్రి విశ్వనాథావధూత స్వాముల వారిని విశేషముగ పూజించుచున్న విషయం భక్తులు గమనింపదగినది.

# ప్రథమాలయ నిర్మాణము

విశాఖపట్టణం దగ్గర కొట్టియాడ గ్రామస్థులు శ్రీ గోరస నారాయణగారు శ్రీ సనారివారి భక్తులు. క్రీ॥శ॥ 1950వ సం॥ ప్రాంతమున వారు బంధు ధర్మముగ తెనాలికి వచ్చిరి. బంధువులతో సంభాషణలు జరిగినవి. అనంతరమున శ్రీ దేవు లక్ష్మీనారాయణ; గోడి నరసింహారావు; గోడి పాపారావు; తుమపాల సూర్యనారాయణ, టేకి కుమారస్వామి గారు మొదలైనవారు శ్రీసనారీ విశ్వేశ్వర స్వాములవారి జన్మస్థలమైన పాలకొండ క్షేత్రమును దర్శింప గోరసవారి వెంట పాలకొండకు పోయిరి.

శ్రీ సనారీశ్వర స్వాముల వారి చారిత్రక స్థలము నందప్పటికి ఆలయ రూపము లేమియు లేవు. శిథిల గృహము-అన్నపూర్ణా దేవి సమాధియు మృణ్మయ నిర్మాణము-చుట్టు ప్రాకారము గాని చెట్లుగాని లేవు. లేక పోయినను తెనాలి నుండి వెళ్లిన యాత్రికులు భక్తి ప్రధానముగ అచటనే వంటలు చేసికొని భోజనములు చేసి అమ్మవారి సమాధి దగ్గరనే శయనించిరి.

ఆ కాలమున గ్రామములో అల్లరులు మక్కుటముగ జరుగుచున్నందున జాగ్రతకై పోలీసువారు ప్రతిదినం రెండు పర్యాయములు గ్రామం నలు మూలల పర్యటించు చుండిరి. నాటి దినచర్య ననుసరించి సాయంత్రం గ్రామ పర్యటనకు వచ్చిన పోలీసు సబ్ ఇన్స్పెక్టర్ అమ్మవారి చెంతనున్న యాత్రికులను చూచి "మీరిచట రాత్రివేళ నుండరాదు. ఎచటికైన పొం"డని హెచ్చరిక నిచ్చెను. కాని భక్తులు అమ్మవారి చెంతనే పరుండిరి. మరల అర్థరాత్రి వేళ పర్యటనకు వచ్చిన యినస్పెక్టర్ "నేను చెప్పినను మీరిచటనే యుంటిరేమి?" అని ప్రశ్నించి నందున గోరసవారు "అయ్యా! ఈ సమాధి యందున్న మాతా అన్నపూర్ణా దేవి మహా మహిమా సంపన్నురాలు. ఆమె సన్నిధిలో నిద్రింపవలయుననియే మేము మా తెనాలి నుండి అనగ- గుంటూరు జిల్లా కృష్ణాజిల్లా పశ్చిమ గోదావరి- తూర్పు గోదావరి జిల్లాలు విశాఖ జిల్లా గూడ దాటి యీ శ్రీకాకుళం జిల్లాకు వచ్చితి"మని బదులు చెప్పిరి.

రక్షణ శాఖాధికారిగారికి ఆశ్చర్యం కలిగి "ఏమిటి? ఆ తల్లియందంత మాహాత్మ్యమున్నదా!"యని ప్రశ్నింపగ గోరసవారు. "ఉన్నది. నిదర్శనం కావలయునేని మీరిచట నిద్రించి చూడండి. కాని మీకు కలిగిన అనుభూతిని మీరెవరికిని బహిరంగం చేయరా"దనిరి. ఇనస్పెక్టర్ గారచటనే

శయనింప నిశ్చయించుకొనిరి. అందువలన అమ్మవారనుగ్రహం కలిగినను కలుగక పోయినను గ్రామమునం దలజడి కలిగించు చున్న దుండగుల వివరములైన లభించునేమోనని తలంచి నందున యాత్రికుల ప్రక్కనే ప్రక్క నమర్చుకొని శయనించిరి.

తెలవారినది. నిద్రమేల్కాంచిన పోలీసధికారి అమ్మవారికి నమస్కరించెను. కాలకృత్యములు దీర్చుకొనిన పిదప పనివారిని పిలిపించి అమ్మవారి చుట్టు గోడలు నిర్మించి పైన కప్పు వేయించిరి. అనగ నేడు పాలకొండ యందున్న సనారీశ్వరాలయమునకు ప్రప్రథమ నిర్మాణ కర్త ఆ పోలీస్ యినస్పెక్టర్ మహాశయులని గుర్తింప దగియున్నది. శ్రీ సనారివారి కాయనొక భక్తుడయ్యెను.

ఆకాలములో పాలకొండ యందున్న బంగారు కనకరాజుగారు రత్నాభరణములు సేయు స్వర్ణశిల్పాచార్యులు. తెనాలి నుండి వెళ్లిన యాత్రికులు "మేము అమ్మవారి సమాధి యొద్ద పూజ చేయుచుంటిమి. మీరును రావలయు"నని పిల్చిరి. కాని కనకరాజుగారు వారి చెంతకు వెళ్లలేదు. మరునాటి యుదయమున కలిసినపుడు కనకరాజుగా రాభక్తులతో "మేమా విశ్వనాథమును "పాముల వీరన్న" అనుచుందుము. వారింటిలో పాము లెప్పడును తిరుగుచుండును. మేమచ్చటకు వెళ్ల"మని చెప్పిరి. అనగ విశ్వనాధాచార్యులవారు నాగాభరణుని దివ్యావతార మనుటయం దతిశయము లేదు.

పోలీసు యినస్పెక్టర్‌గారు ప్రధమముగ ఆలయ రూప కల్పన చేసిన కొన్ని దినములకా పాలకొండలోని విశ్వబ్రాహ్మణ ప్రముఖులొక సమాజముగ ఏర్పడి భక్తాదుల ద్రవ్య సహకారములతో ఆలయమును కొంత వృద్ధి గావించిరి. ప్రస్తుతమున అమ్మవారి సమాధిగల గర్భాలయము నంటుకొని విశాలమగు మండపము- దాని ముందు నుయ్యి - తులసికోట - ప్రాకారము మొదలగు కట్టడము లేర్పడినను నేటికి దేవాలయ మనదగిన స్థితిని పూర్తిగ పొందలేదు. ముందు ముందు అభివృద్ధి పొందదగియున్నది. పరమేశ్వరానుగ్రహమున పాలకొండ శీఘ్రకాలములోనే శ్రీ సనారీ విశ్వేశ్వర స్వాములవారి పాలిత క్షేత్రముగ ప్రసిద్ధి కెక్కి సమస్త సౌకర్యములు కలిగిన యాత్రాస్థలమై భక్తాదుల కిహపరంబుల ప్రసాదించుగాక.

- శుభమ్ -